సంస్థాపకులు
వి. వి. రాఘవయ్య



మేనేజింగ్ ఎడిటర్
లీలావతి రాఘవయ్య

సంపుటి 20 | నవంబర్ 1982 | సంచిక 10

# ఇదీ వరస...



ఈ నెల నవలానుబంధం

## చిగురంత వెలుగు

రచన

## పాలకోడేటి సత్యనారాయణరావు

జ్యోతి, పి. బి. నెం 1824, హైదరాబాదు-20

జయసుధ ముఖచిత్రం

# తొలిమాట



## మార్పు...

రాష్ట్ర రాజకీయాలు రాష్ట్రంకోసమో, పార్టీకోసమోగానీ, మారిపోయి పాతమంత్రులతోటి, కొత్త వాగ్దానాలతో మళ్ళీ మొదలయింది....ఒకవైపు దేశం సగం జలమయంనించి బయటపడుతుంటే ఇంకోవేపు కరువుల్తో, దాహంతో మలమల మాడిపోతున్నారు-ఇలా వుంటే ఒక ఇన్సాట్ నష్టంగాక-ప్రయోజనం కంటే ప్రెస్టేజ్‌లాగ మరొక ఇన్సాట్‌ని ప్రకటించారు! నేషనల్ టెక్స్‌టైల్స్ వారి కోట్ల నష్టం, ఆసియా క్రీడల తలకి మించిన భారం 'ఖర్చు', బొంబాయి ఆఫ్‌షోర్ నష్టం....

ఇవిగాక టోరంటో చర్చలలో వరల్డ్ బ్యాంక్‌నుంచీ హెచ్చింపు ఋణాలు.. రాష్ట్రస్థాయి సరికొత్త ఋణాలు....ఋణమయం! కొత్త సంవత్సరంలో కొత్త ఆర్థిక బాధలు, అధిక ధరలనీ కాచుకునే శక్తి రావాలి మనకి!-ప్రగతో, తిరోగతో గానీ, పథంలో మాత్రం వున్నాం మనం!

మానవజాతి మొత్తం సిగ్గుపడేలా జరిగిందో 'హింసనపణ' లెబనాన్‌లో. ఇజ్రాయిలీ అజ్ఞానపు చీకటి కేక దారుణంగా వేలాదిమందిని నిర్దాక్షిణ్యంగా చంపేసింది..నియంతలు అంతరించినా నియంతత్వం అంతరించదు ఎక్కడా! అమాయకుల కన్నీటి విలువ తెలిస్తే గదా మానవత విలువ తెలిసేది....

కొత్త సీరియల్ ప్రచురిస్తున్నాం ఈ సంచికలో....మీ అందరికీ సంతృప్తి నిస్తుందని ఆశిస్తున్నాం.

[illegible]



# ప్రత్యేకంగా మీకోసం!

దీపావళి దీపాల్లా కళకళలాడుతూ
శ్రీ బాపు ముఖచిత్ర కాంతితో
మీ ఇంటి కొస్తోంది



## ప్ర త్యే క సం చి క

వెలుగు రవ్వల్లాటి కథలతో వచ్చేస్తోంది

## వెల పది రూపాయలే!

ఆర్డర్లకై వెంటనే రాయండి.

నవంబర్ మొదటి వారంలో
వచ్చే మొదటి దీపావళి జ్యోతే!






ఈనెల జ్యోతి చదివాను. కథలన్నీ బాగా వున్నాయి. డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు, సౌభాగ్యలత సీరియల్స్ బాగా ఆనందింపజేస్తున్నవి మొత్తంమీద ఈనెల "జ్యోతి" అందంగా, ఆనందం కలిగించినందుకు జ్యోతికివే నాహృదయపూర్వక కృతజ్ఞతలు.

... సదాశివుని శేఖరబాబు,
ఖుర్దారోడ్ (ఒరిస్సా)

శ్రీదేవి ముఖ చిత్రాన్ని యింత వరకూ ఎన్నో పత్రికలు ప్రచురించాయి. కానీ మీరు కొత్త స్టయిల్‌లో ప్రచురించినందుకు చాలా ఆకర్షణీయంగా వుంది. కథల్లో ముఖ్యంగా మాకు నచ్చిన కథ "మగమనసు". "ఓటున్న బాబుల్లారా!" మినీ కథయినా బావుందనిపించింది. కార్టూన్లలో "మల్లిక్"గారివి ఓ మోస్తరుగా వుంటే "కాటూరి"గారి కార్టూన్లు, మంచి కిక్ యిచ్చాయి 'స్వాతంత్ర్యం' కవిత భావ యుక్తంగా వుంది.

విజేంద్రనాథ్ ప్రసాద్.
ఆదోని.

జ్యోతి మాసపత్రికలో డబ్బు టు ది పవర్ ఆఫ్ డబ్బు చదువుతున్నాను. రచయిత శ్రీ యండమూరి అద్భుతంగా వ్రాస్తున్నారు. మన యూనివర్సిటీలు కాలేజీలు, నేర్పని బతుకు పాఠాలు ఈ సీరియల్‌లోని పాత్రల ద్వారా నేర్చుకోవచ్చనిపిస్తోంది. మన యూనివర్సిటీ వారు ఈ రచనని డిగ్రీ కోర్సులలో ఓ పాఠ్యపుస్తకంగా ప్రవేశపెడితే, బాపి నిరుద్యోగ పౌరులకి నిరాశా నిస్పృహలంతగా ఉండవేమోనని నా ఉద్దేశ్యం. ఈ సీరియల్ ప్రచురిస్తున్న మీకు నా ధన్యవాదాలు.

రాజారావు,
శ్రీకాకుళం.

**చిరంజీవి:**

జ్యోతి అక్టోబర్ సంచికలో శ్రీ బాపు గారిపై రాసిన ప్రత్యేక వ్యాసం చిన్నదిగా, చాలా బాగున్నది. బాపుగారితో బాటు తెలుగు ఆడపిల్లని నాజూగ్గా వర్ణించేరు.

శ్రీ బాపు నిజంగా చిరంజీవే-టైటిల్ అదే పెట్టవలసింది-తెలుగుతనం ఒకవేళ పోయినా, మనకి బాపు వుంటారు-గుర్తు చేయడానికి.

ఈ వ్యాసాన్నందించిన జ్యోతికి నా ప్రత్యేక ప్రశంసలు.

వి. అపర్ణ,
విజయవాడ.

## మైమ్ (మూకాభినయం) కళాకారుడికి సన్మానం



మన రాష్ట్రంలో ప్రముఖ మైమ్ కళాకారుడు శ్రీ పోలాప్రగడ జనార్దనరావు మూకాభినయం ఇంకా బాగా ప్రచారం జరగవలసిన మన తెలుగు ప్రాంతంలో ఇప్పటికే ఆయన ప్రముఖ స్థానాన్ని పొందారు. సినిమా, టివితో సమానంగా మూకాభినయాన్ని ఎంతో ప్రోత్సహిస్తున్నారు విదేశీయులు. మనకి ఈ రకమైన కళా విన్యాసం అభివృద్ధికి తేవాలన్నది శ్రీ జన్ని ఆకాంక్ష. ఆయన్ని బొంబాయి తెలుగు కళాసమితివారు ఇటీవల ఘనంగా సన్మానించి మైమ్ ప్రదర్శన ఏర్పాటు చేశారు. మన దేశం మొత్తంమీద వున్న బహు కొద్దిమంది మైమ్ కళాకారులలో శ్రీ జన్ని ఒకరు. వందకి పైగా ప్రదర్శనలిచ్చిన జన్ని అల్ ఫ్రెడ్ ఫారిన్ దగ్గర ఈ విద్య నేర్చారు. రాంచి, రూర్కెలా, కలకత్తా, మద్రాసు ఆంధ్ర కళా సమితులు ఆయన్ని సత్కరించారు ఇప్పటికే.

శ్రీ జన్ని టెక్నీసి కథా రచయిత కూడా. ఆయన ప్రస్తుతం ఇ సి ఐ. ఎల్ హైదరాబాద్‌లో ఎకౌంట్స్ ఆఫీసర్‌గా పని చేస్తున్నారు

## కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ స్మారక బహుమతి

నాగార్జున విశ్వవిద్యాలయం వారిచే 1981-1982వ సంవత్సరానికి నిర్వహించబడే "కీ. శే. ఉన్నవ లక్ష్మీనారాయణ స్మారక బహుమతి" సాంఘిక నవలారచన పోటీ-1981 లో రచించబడిన నవలలు 15-1-1983 తేదీలోగా రిజిస్ట్రారు, నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జుననగర్-522510 వారి కార్యాలయానికి చేరేలాగ పంపాలెను, ఆ తేదీ తరవాత అందిన నవలలు పోటీకి అనుమతించబడవు. నవలా రచనకు ప్రవేశరుసుం లేదు. వ్రాతపూర్వకంగా వున్నవి లేక ముద్రించబడిన నవలలు పోటీకి పంపవచ్చు. ఈ పోటీకి పంపు నవలలు మరి ఏ ఇతర సంస్థ నిర్వహించిన పోటీలో బహుమతి పొంది వుండరాదు. ఎన్నిక చేయబడిన ఉత్తమ నవలకు 1,000/- రూ. బహుమతి ఇవ్వబడును.

వివరాలకు, రిజిస్ట్రారు నాగార్జున విశ్వవిద్యాలయం, నాగార్జున నగర్‌కు వ్రాయండి



ఆర్మూర్‌లో సాహితీ వేదిక 'నవత' ఆధ్వర్యంలో సెప్టెంబర్ 15 తేదీన ఆధునిక వ్యాస సంపుటి 'కొత్తయుగం'ను అంకితం అందుకున్న డా॥ సి. నారాయణ రెడ్డిగారు గ్రంథకర్త, నవత అధ్యక్షులు, రాష్ట్రీయ సాహిత్య అకాడమి సభ్యులు శ్రీ ఏ. సూర్యప్రకాశ్ గారిని సన్మానిస్తున్న దృశ్యం.





# మినీ కథల పోటీ ఫలితాలు

## మొదటి బహుమతి

ఆత్మవిశ్వాసం .... జి. ఎన్. సూరి

## రెండవ బహుమతి

హైజాకింగ్ .... బి. ఎస్. ఎన్. మూర్తి

## మూడవ బహుమతి

విషోదయం .... తనికెళ్ళ భరణి

## కన్సొలేషన్ బహుమతులు

1. హేండికేవ్ .... మధు చక్రవర్తి
2. నీ-నా .... చెల్లూరి సీతారామేశ్వరరావు
3. వెలుతురొస్తుందా? .... మన్నెం నరసింహారావు
4. ఫొటో .... వి. రాజారామ్మోహనరావు
5. మనిషి .... ఎ. డి. గౌరీశంకర్
6. గుంట్రబల్ల .... పి. శ్రీనివాసశాస్త్రి
7. భయపడినవాడు .... కందుకూరి శ్రీరాములు



# * డాక్టర్లు -


నేనిదివరకు పశువుల డాక్టరునా
అని అడుగుతున్నారా?
మీకా అనుమానం ఎందుకొచ్చింది?


తిన్నదరగట్లేదా?... తిన్నవెంటనే
ఆర్టీసీ బస్సెక్కి ఓ రౌండుకొట్టండి


మీ యావిడ్ని కుక్క కరిచిందా?
మరి దాన్ని తేకుండా ఈవిడ్ని
తెచ్చారేం?


చూడవోయ్ అసిస్టెంటూ—
థర్మామీటరట్టా కాదు పెట్టేది...

— మల్లిక్ *


అలా ముఖం నల్లబడ్డం చర్మ
రోగ లక్షణం కాదమ్మా... ముఖం
పొగచూరిపోయింది—చుట్టలు
కాల్చడం మానమని చెప్పండి.


నిన్న సరిగ్గా ఉడకని కోడికూరగానీ
ఆయనకు పెట్టారా?
డా॥ పశుపతి
కొక్కొరోకో


మీ జబ్బు వారమైనా తగ్గలేదంటే
పెద్దాపరేషను చేయాలనుకుంటా!!


మీ ఇద్దరికీ కడుపునొప్పిగానీ
ఒకరికి అతిగా తినడంవల్లా, ఒకరికి
అసలు తినకపోవడం వల్లా వచ్చింది.
Mallik



మినీ కథల పోటీలో ప్రథమ బహుమతి పొందిన కథ

# ఆత్మవిశ్వాసం

జి. ఎస్. సూరి

సుందరం ఉద్యోగం పోయింది!

ఆరోజు సాయంకాలం అంతవరకూ అతనికి రావల్సిన జీతం అందచేస్తూ తన గదిలోకి పిల్చి చెప్పాడు ఆసంగతి మేనేజర్.

కంపెనీ నష్టంలో నడుస్తోందట.

అదీ కారణం!

అతన్ది టెంపరరీ అపాయింట్మెంట్. అందుకని చేయగలిగింది ఏం లేదు. అక్కడికీ మేనేజర్ని కాళ్ళు పట్టుకోవటం మినహాగా తన పట్ల దయ చూపించమని ఎంతగానో వేడుకున్నాడు సుందరం.

మేనేజర్ కరగలేదు.

తన చేతుల్లో ఏం లేదన్నాడు.

సుందరం నీరుకారిపోయాడు. అతనికి భవిష్యత్ భయంకరంగా అనిపించింది. రేపట్నుంచి ఎలా?....ఎలా జీవితం గడపటం? అతని గుండె చిన్నగా వణికింది....మెదడులో కోటి తుఫాన్లు ఒక్కసారిగా చెలరేగి అల్లకల్లోల పరుస్తున్నాయి.

భార్యా....ఇద్దరు పిల్లలతో ఏం చేయటం?....ఎలా బ్రతకటం?

ఆఫీసునుంచి బయటపడి రోడ్డెక్కాడు.

సుందరం నడుస్తున్నాడు. చెదిరిపోయిన మనసుతో....చెల్లాచెదురై గందరగోళపరుస్తున్న ఆలోచన్లతో.

దేశంలో వికటాట్టహాసం చేస్తూ విలయతాండవం చేస్తున్న నిరుద్యోగ రాక్షసి తన పంచకి మరో దౌర్భాగ్యుడు వచ్చి చేరుతున్నందుకు ఎగిరి గంతేస్తున్న దృశ్యం సుందరం కళ్ళముందు మెదిలింది.

అతను చాలా కలవరపడిపోయాడు.

"పూలు....పూలు....మల్లెపూలు .... జాజిపూలు...." అంటూ వినపడిన

లేకను అప్రయత్నంగా ఆలోచనల్లనుంచి తేరుకొని అటు చూశాడు.

రోడ్డుప్రక్క బడ్డీదగ్గర కూర్చుని రంగురంగుల పూలని మాలగా కడ్తూ అరుస్తున్నాడొకతను.

అతన్ని చూసి సుందరం కనుబొమ్మలు ముడిపడ్డాయి.

ఎక్కడో చూశాడు అతన్ని?....

రిక్షా. రెండునెలల క్రితం సుందరం ఆఫీసుకు వెళ్తూంటే పెద్ద బజారు సెంటర్లో గుంపులుగా జనం పోగయితే ఏమిటోనని చూడటానికి వెళ్ళాడు.

అక్కడి దృశ్యం చూసి సుందరం కళ్ళు తిరిగిపోయాయి. రక్తపు మడుగులో ఒక మనిషి పడున్నాడు. ప్రక్కనే తుక్కు అయిపోయిన రిక్షా.



కాని ఎక్కడా?

అతని జ్ఞాపకాల తెర తొందరగా కదల్లేదు.

రెండు నిముషాల తర్వాత అతన్ని ఎక్కడ చూశాడో గుర్తుకు వచ్చింది సుందరానికి.

అతను.... అతను రిక్షాతొక్కేవాడు. [illegible] ఎక్కాడు అతని

లారీ గుద్దేసిందట.

ఎక్కువసేపు అక్కడ వుండలేక ఆఫీసుకి వెళ్ళిపోయాడు సుందరం. ఆ రోజంతా అతని కళ్ళముందు ఆ యాక్సిడెంటు తాలూకు దృశ్యమే మెదిలింది.

తర్వాత ఎవరో [illegible]. వాణ్ణి హాస్పిటల్లో చేర్చారనీ.... [illegible]

ప్రమాదంగా ఉందన్నారని.

అదిగో ఆతర్వాత వాడు కనపడటం ఇదే. అయితే బ్రతికాడన్నమాట! మరి రిక్షా మానేసి పూలు అమ్ముకుంటున్నాడేమిటి?

సుందరం వాడిదగ్గరకు వెళ్ళాడు.

అప్పుడు తెల్సింది సుందరానికి ఆ యాక్సిడెంట్‌లో వాడి రెండు కాళ్లు తీసేశారట. బ్రతుకుతెరువుకి ఈ వ్యాపారం మొదలుపెట్టాడట!

సుందరంలో ఎక్కడో అట్టడుగున వుండిపోయిన ఆత్మవిశ్వాసం అతనికి విపరీతమైన ధైర్యాన్ని ఇచ్చింది.

కాళ్ళు పోయినవాడే అత్యంత ధైర్యంతో బ్రతుకుని వెళ్ళదీసుకుని వస్తూంటే....ఉద్యోగం మాత్రమే పోయిన తనెందుకు బెంబేలు పడి పోవాలి?

నో . . తన బ్రతుకునిగురించి బెంగ పెట్టుకోనక్కర్లేదు. ఈ విశాల ప్రపంచంలో కష్టపడి పనిచేసేవాడికి కడుపు నిండే మార్గాలు ఎన్నోవున్నాయి.

అది పూలు అమ్మైనా సరే.

పుడకలు అమ్మైనా సరే.

అది తనుమాత్రం ఎందుకు చేయలేడు?

సుందరంలో ఆత్మవిశ్వాసం వెన్నుతట్టి ధైర్యం చెప్తూంటే ఉత్సాహంగా ఇంటివైపు నడవసాగాడు! ❋

# 1

# యువతీ యువకులకు శుభవార్త

**పెళ్ళికి ముందు లేక పెళ్ళికి తర్వాత**

**మీకేమన్నా సమస్యలున్నాయా!**

**ఉంటే పరిష్కారం ఫర్లాంగు దూరంలో ఉంది.**

సంశయం, మొహమాటం ఎందుకు

ఫర్లాంగు ముందుకెళ్ళండి, సమస్యని పరిష్కరించుకోండి.

**-కాలేజ్ ఆఫ్ ప్రేమిస్ట్రీ**

నున్నటి రోడ్డుమీద రయ్యిమని దూసుకుపోతున్న టయోటా కారు, ఆ బోర్డుదగ్గర ఒక్కసారి ఎగిరిపడ్డట్టయింది. వెనక సీట్లో విలాసంగా కూర్చుని పేపరు చదువుకుంటున్న ఆనందరావు తనని ఎవరో ఎత్తి కుదేసినట్టుగా ఫీలయ్యాడు.

"సారీ సర్" ఆ బోర్డును చూస్తూ పరధ్యానంగా కారు నడుపుతున్న డ్రైవర్ క్షమాపణ చెప్పుకున్నాడు.

"ఏమయింది?" ఆశ్చర్యంగా అడిగాడు ఆనందరావు.

"స్పీడ్ బ్రేకర్ దగ్గర కొచ్చేదాకా చూసుకోలేదు. చాలా ఎత్తుగా స్టెప్‌గా వేసారు." డ్రైవర్ సంజాయిషీ చెప్పుకున్నాడు.

ఆనందరావు నవ్వాడు. "ఇవి స్పీడ్ బ్రేకర్లు కావు. టైరు బ్రేకర్లు, సైలెన్సర్ల బ్రేకర్లు. రోడ్డు కడ్డంగా ఇష్టమొచ్చినట్టుగా కొత్త కంకర, తారు పొయ్యటమే తప్ప, స్పీడ్ బ్రేకర్‌కి కూడా కొన్ని కొలతలున్నాయని మర్చిపోతారు మనవాళ్ళు." యథాలాపంగా కామెంట్ పడేసి మళ్ళీ పేపర్లో తలదూర్చబోయిన ఆనందరావు తన కళ్ళని తాటికాయలంతేసి అక్షరాలతో ఉన్న ఆ బోర్డు చటుక్కున ఆకట్టుకోవడంతో తేరిపార చూసాడు.

కారు వేగం పుంజుకుంది.

డ్రైవర్ ఆ బోర్డువంకే చూస్తూ పరధ్యానంగా కారు నడిపాడా అని అనుమానం వచ్చింది. డ్రైవర్‌కేసి చూసాడు - అతని వయసు పాతిక. ఆశ్చర్యమేముంది.

**"మీ సమస్యలకు సమాధానం వంద గజాల దూరంలో వుంది. ఎడమవైపుకి తిరగండి"**

మరో బోర్డు కనిపించింది. ఆనందరావు దానికేసి ఉత్సుకతతో చూస్తు




న్నారు.

కారు ఎడమవైపుకి తిరిగింది.

**ఇక్కడనుంచి మీ సమస్యలకి ఎంత దూరమో తెలియదు. కాని పరిష్కారం యాభై గజాల చేరువలో వుంది. కుడివైపుకి తిరగండి.**

మరో బోర్డు.

కారు కుడివైపుకి తిరిగింది. ఆనందరావు ఉత్కంఠ ఇనుమడించింది.

**ఇక్కడనుంచి మీ సమస్యలు సుదూరం. పరిష్కారం అతి చేరువ. తిన్నగా వెళ్ళండి.**

కారు తిన్నగా వెళ్ళింది. ఆనందరావు ఆశ్చర్యపోయాడు.

**ఇదే కాలేజీ ఆఫ్ ప్రేమిస్ట్రీ. ప్రేమాలయం. యువతి యువకులకు ధామాలయం. ఆగండి. లోనికి రండి.**

ఆ బోర్డు వున్న గేటుముందు కారు ఆగింది. లోపలికి వెళ్ళబోయింది.

"ఏమిటిది, ఎక్కడికి పోతున్నాం. పరబ్రహ్మం ఇల్లు మారాడా" కంగారుగా అడిగాడు ఆనందరావు.

"కనుక్కురమ్మంటారా" కారాపి అడిగాడు డ్రైవర్.

"మారినట్టు చెప్పలేదే. ఇల్లు మాత్రం మారిపోయింది. ఈ కాలేజీ వ్యవహారం ఏమిటి" ఆనందరావు తర్జన భర్జన పడుతున్నాడు.

కారు ఆ ప్రాంగణంలో పెంకుటింటి ముందు ఆగింది. డ్రైవర్ దిగి ఆ ఇల్లేనా కాదా అని కనుక్కోవడానికి వెళ్లాడు. ఓ నిమిషంలో వచ్చి తలుపు తీసాడు. కారులోంచి బయటికి దిగాడు ఆనందరావు.

''ఈ కాలేజీ పరబ్రహ్మంగారిదేట'' అన్నాడు డ్రైవర్.

"ఓరి, వీడికేం పోయేకాలమొచ్చింది" ఆశ్చర్యపోయాడు ఆనందరావు.

ఆ ఇంటి వరండాలోకి వెళ్ళాడు. తను ఇక్కడికి వచ్చి ఏడాది దాటింది. ఇంతలో ఎంత మార్పు:

చుట్టూ గుబురుగా పెరిగిన చెట్లమధ్య ఆశ్రమంలా వుంది ఆ ఇల్లు. పక్షుల కిలకిలలు తప్ప అలికిడి లేదు. ఇంటిముందు నాలుగు మోటారు సైకిళ్లు, రెండు స్కూటర్లు, మూడు మోపెడ్లు, అయిదు సైకిళ్లు వున్నాయి.

వరండాలోంచి ముందుకెళ్ళిన ఆనందరావు కుడివైపున్న గదిని చూసాడు. క్లాసు రూంలా మార్చారు దాన్ని. పరబ్రహ్మం కుర్చీలో కళ్లు మూసుక్కూర్చున్నాడు. అతని వెనక బోర్డు నల్లగా వుంది. ఎదురుగా కుర్చీల్లో కూర్చున్న పదిహేనుమంది కుర్రాళ్లు ఏకాగ్రతతో ఆలోచించడానికి ప్రయత్నిస్తున్నారు.

ఒక కుర్రాడు కళ్లు మూసుకున్నాడు. ఇంకోడు కళ్ళజోడు సర్దుకుంటున్నాడు. సీలింగ్‌ఫాన్‌వైపు చూస్తూ ఆలోచిస్తున్నాడు ఇంకో అబ్బాయి. చెంపకు చెయ్యాన్చి గోడవైపు చూస్తున్నాడు ఒక అబ్బాయి. రెండు చేతుల్లో ముఖం దాచుకున్నాడు మరొకడు.

వివిధ భంగిమల్లో వున్నారు అందరూ.

''కుర్చీలో కూర్చుని నిద్రపోతున్న వీడు పాఠాలేం చెప్తాడు'' అనుకుని అలికిడి చెయ్యకుండా ఆ రూంలోకి వెళ్లాడు ఆనందరావు.

యాభై ఏళ్లు దాటిన ఓ బట్టతలాయన తన క్లాసులోకి రావడంతో ఆశ్చర్యపోయారు ఆ కుర్రాళ్లు. పొడుగ్గా లావుగా వున్న ఓ శాల్తీని చూసుకుని అతని వెనక కూర్చున్నాడు ఆనందరావు.

ఆనందరావు కొత్తగా చేరాడేమో అనుకుని, ఓ కుర్రాడు అతనికో పేపర్ని అందించాడు. బుద్ధిగా దాన్ని తీసుకున్నాడు ఆనందరావు.

## ASSIGNMENT No. 1

అబ్బాయి, అమ్మాయి ఒకలా ప్రవర్తిస్తే వాళ్లు ప్రేమించుకుంటున్నారు అని అందరూ అనుకుంటారు. మరోలా ప్రవర్తిస్తే వాళ్లు ప్రేమించుకోటంలేదు అని అనుకుంటారు, అంటే-ప్రవర్తన ఒకలా వుంటే ప్రేమ వుంది అని, మరోలా వుంటే ప్రేమ లేదని మన అందరికీ అనిపిస్తుంది. ప్రేమ వుంది అని ఎదుటివాళ్ళకి అనిపించాలంటే మనం ఎలా వుండాలి? ఉదాహరణకి మీరు




ఓ అమ్మాయిని ప్రేమించారనుకోండి. 'ఇది ప్రేమ' అని అనిపించాలంటే మీరేం చేస్తారు? మీ దృష్టిలో ప్రేమంటే

మీ సమాధానం ఒక్క వాక్యం లేదా రెండు వాక్యాల్లో వుండాలి. ఆలోచించి రాయండి.

ఆనందరావు దాన్ని చదివాడు.

''ఓసి దీనిగురించా అందరూ ఇలా తల బద్దలు కొట్టుకుంటున్నారు.'' అతని మీసాలమధ్య చిరునవ్వు మెరిసింది.

కళ్లు మూసుకుని సమాధానం రాశాడు. రాసి నిర్లిప్తంగా కూర్చున్నాడు.

"సమాధానం రాయడానికి ఇంకా మూడు నిమిషాలే వుంది." ముందు వరసలో కూర్చున్న అబ్బాయి వెనక్కి తిరిగి కళ్ళజోడు సర్దుకుంటూ ఆనందరావుతో అన్నాడు.

''అయిపోయింది రాసేసాను'' అన్నాడు ఆనందరావు.

అతను ఆశ్చర్యపోయి కళ్ళజోడులోంచి ఉగ్రంగా చూసాడు. అలా చూసి పక్కతనితో గుసగుసలాడాడు. ఆ పక్కతను ఆనందరావువైపు గమ్మత్తుగా చూసాడు. ఓ నిమిషంలో అందరూ ఆనందరావువైపు చూడ్డం మొదలెట్టారు.

"అయిందా" నిశ్శబ్దాన్ని బద్దలుచేస్తూ అడిగాడు పరబ్రహ్మం. సమా

లోంచి లేచిన యోగిలా వున్నాడు. అతన్ని, ఆ వేషాన్ని చూస్తే ఆనందరావుకి నవ్వొచ్చింది. 'వీడి తస్సాదియ్యా' అనుకున్నాడు. పరబ్రహ్మం కంట పడకుండా ముందువరసలో విద్యార్థి వెనక నక్కాడు. అయినప్పటికీ మొదటి వరసలో వున్న ఇద్దరు కుర్రాళ్లు తల వూపారు.

"నేను ఈరోజు మీకు ముఖ్యమైన మూడు ప్రేమసూత్రాల్ని చెప్తాను. ప్రేమ గమనాన్ని, బలాన్ని సూచించే ఈ సూత్రాలు న్యూటన్ సూత్రాలతో సమానమైనవి. జాగ్రత్తగా వినండి.

ఒకటి : వెలుపలి శక్తి ప్రమేయం లేనంతవరకు ప్రేమ చలనం లేకుండా పడుంటుంది. లేదా మారని వేగంతో ముందుకు దూసుకుపోతుంది.

ఈ సూత్రంలో రెండు భాగాలున్నాయి. ప్రేమ అనావృష్టి, అతివృష్టి.

ఇప్పుడు ప్రేమ అనావృష్టిని చూద్దాం :

ఒక అబ్బాయి, అమ్మాయి ఒకర్నొకరు చూసుకోకుండా ఎవరి గదుల్లో వాళ్లు గోళ్ళు గిల్లుకుంటూ కూర్చున్నారనుకోండి. ప్రేమ వాళ్ళ హృదయపు పొరల్లో చలనం లేకుండా పడుంటుంది. అదే అమ్మాయి, అబ్బాయి బయటకు వెళ్ళి ప్రపంచాన్ని చూసారనుకోండి, ఎవరో ఓ అమ్మాయి ఓ అబ్బాయి హృదయాన్ని కదిలిస్తుంది. ప్రేమ అంకురిస్తుంది. అంటే ప్రేమించబడాలనుకున్నవాడు ఎంతో కొంత పరిశ్రమ చెయ్యాలి. బయటికెళ్ళాలి. అమ్మాయిల్ని చూడాలి. వాళ్ళని ఆకర్షించడానికి ప్రయత్నించాలి. ఇలా శక్త్యనుసారం పని చేస్తే ప్రేమలో పడే అవకాశం వుంది. ఇంట్లో ముసుక్కు మూసుకూర్చుంటే ఎవరూ ప్రేమించరు. ఇది అనావృష్టి.

ఇక అతివృష్టి :

ప్రేమ ఒకసారి ప్రారంభమైందనుకోండి. మనం బలవంతంగా పగ్గాలు వేసి అదుపులో పెట్టకపోతే అది ముదిరిపోతుంది. ఆగకుండా ముందుకి పోతుంది. ప్రేమ వెర్రిగాను, వెర్రి వ్యామోహంగాను, వ్యామోహం పిచ్చిగాను మారుతుంది.

హృదయాంతరాళాల్లో వుందో లేదో అనిపించేలా నిద్రపోతున్న మూగ ప్రేమని మేల్కొలిపి, ముందుకి పరుగెట్టించి అలా వదిలేస్తే అది రిజిస్టర్ మారేజ్ వైపో, లేదా ఆత్మహత్యవైపో పరుగెడుతుంది.

మొదటి దిశలో వెడితే పర్వాలేదు. రెండో దిశలో వెళ్ళినప్పుడే డేంజర్. అప్పుడే మనం మనోబలాన్ని ఉపయోగించి ప్రేమ అలా పరుగెత్తకుండా ఆపాలి. దేవదాసు, మజ్ను, సలీం ఈ సంగతి తెలియకే దెబ్బతిన్నారు. ఒక ఎఫైర్ ఫెయిలయినప్పుడు మనసు మార్చుకుని బుద్ధిగా మరో ఎఫైర్ కోసం వెతుక్కోవడం తెలివైనవాడు చేసే పని.




ఇక రెండో సూత్రం :

పరబ్రహ్మం లేచాడు. బోర్డుమీద ఒక ఈక్వేషన్ వేసాడు.

$$F = m\left(\frac{v-u}{t}\right) = ma$$

ఇది న్యూటన్ రెండో గమన సూత్రం. ఇది ప్రేమకి ఎలా వర్తిస్తుందో చెప్తాను. m పరిమాణంలో వున్న మీ ప్రేమ u వేగంతో వుందనుకోండి. ఆ వేగాన్ని u నుంచి v కి t అనే సమయంలో పెంచాలనుకోండి. దానికావలసిన బలం $F = m\left(\frac{v-u}{t}\right) = ma$

దీన్ని జాగ్రత్తగా చూద్దాం.

మీ ప్రేమవేగాన్ని పెంచాలంటే బలం కావాలి. తక్కువ వేగం చాలనుకుంటే తక్కువ బలం, ఎక్కువ వేగం కావాలనుకుంటే ఎక్కువ బలం కావాలి. అంతేకాదు. ఆ వేగం తక్కువ సమయంలో పెరగాలంటే మరింత బలం కావాలి. సమయం కాస్త ఎక్కువైనా పర్వాలేదు అనుకుంటే తక్కువ బలం చాలు. ప్రతి ప్రేమికుడు ప్రేమకి కావలసిన వేగం, వున్న సమయంబట్టి వానికావలసిన మనోబలాన్ని లెక్కగట్టుకోవాలి.

మూడో సూత్రం :

ప్రేమలో ప్రతిక్రియకి సమానమైన వ్యతిరేకమైన ప్రతిక్రియ వుంటుంది.

మనం సినిమా హీరోలా మొదటి చూపులో కన్నుగీటి, రెండో చూపులో ఒళ్ళు మీటి మూడో చూపులో డ్యుయట్ పాడామనుకోండి-ఆ అమ్మాయి తండ్రో, అన్నో లేక ఆ అమ్మాయి వెంటపడుతున్న మరో హీరోనో ఎవరో ఒకరు మనకి ప్రతిక్రియ చేసే అవకాశం వుంది. ప్రతి ప్రేమికుడు దీన్ని జాగ్రత్తగా గమనించాలి. ఇలా ప్రపంచంలో ప్రతి సైన్సుకి ప్రేమతో సంబంధం వుంది. న్యూటన్ సూత్రాలు ప్రేమికి ఎలా వర్తిస్తాయో చెప్పాను. ఇవాల్టికి ఇది చాలు. ఇక [illegible]

పరబ్రహ్మ [illegible] ఏదోయాడు.

"ప్రొఫెస[illegible]గారూ మా సమాధానాలు చూడరా" ముందు బెంచీలో కుర్రాడు అడిగాడు.

"అబ్బా. ప్రేమంటే అన్న ఎసైన్‌మెంట్ కదూ. ఒకొక్కరూ మీ సమాధానాన్ని చదవండి. ప్రేమంటే మనవాళ్ళు ఏం అభిప్రాయపడుతున్నారో చూద్దాం"

ఒక అబ్బాయి లేచి నిలబడ్డాడు.

"ప్రేమంటే ఆ అమ్మాయి కావాలనుకోడం" అన్నాడు.

"ఆ అమ్మాయి ఏం కావాలనుకుంటున్నావు" అన్నాడు పరబ్రహ్మం. అందరూ గొల్లున నవ్వారు.

"ప్రేమంటే ఒక భావన. దాన్ని మాటల్లో చెప్పలేం. చేతల్లో చూపించలేం." భావకవిలా అన్నాడు లాల్చీ వేసుకున్న కుర్రాడు.

"బాబూ నీకు ప్రేమిస్ట్రీ క్లాసులు చాలా అవసరం. రోజూ రా. మాటల్లో చెప్పక, చేతల్లో చూపించకపోతే ప్రేమ గుండె అరల్లో, మమతల పొరల్లో ఇనప్పెట్టెలో బంగారంలా గుప్తంగా వుండిపోతుంది. ఎందుకూ పనికిరాదు. మొదటి సూత్రం చదువుకున్నావుగా"

ఇంకొకతను లేచాడు.

"ప్రేమంటే ఆ అమ్మాయి దగ్గరుంటే ఆ అమ్మాయిని చూస్తూ పనిచెయ్యలేకపోడం. ఆ అమ్మాయి దూరంగా వుంటే ఆ ఆలోచనల్తో పనిచెయ్యలేకపోడం"

"ఓహో పనిచెయ్యలేకపోడం ప్రేమా! అయితే మన గవర్నమెంటు ఉద్యోగులందరూ నీ దృష్టిలో ప్రేమికులా" పరబ్రహ్మం మాటలకి అందరూ నవ్వారు.

"ప్రేమంటే కౌగిలి, ముద్దు, ముచ్చట, కలలు" ఇంకో అబ్బాయి అభిప్రాయం.

"ఏమిటిది రివర్స్ గేరులో పోతోంది. అతివృష్టిలోంచి అనావృష్టిలోకి పోతున్నావు జాగ్రత్త"



"ప్రేమంటే ఇద్దరూ ఇష్టంగా ఒకే పార్కుకి షికారు వెళ్ళడం, ఇష్టంగా ఒకే స్వీటు తినడం, ఒకే సినిమా చూడ్డం. ఒకే చీర కొనడం"

"గుడ్ నెక్స్ట్"

"ప్రేమంటే ఆ అమ్మాయిని నాలుగు గంటలసేపు ఆ అమ్మాయికి ఇష్టమైన చీరెల షాపులో వదిలేసి, ఆ తర్వాత కూడా నవ్వుతూ బిల్లు చెల్లించడం. అప్పు తీర్చుకోడంకోసం నాలుగు నెలలు ఓవర్ టైం చెయ్యడం"

"గుడ్"

పరబ్రహ్మం కళ్లు మూసుకుని తల పంకించాడు.

"ప్రేమంటే ప్రేమించిన అమ్మాయికి పెళ్ళి చెయ్యడం"

ఆ సమాధానానికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాడు పరబ్రహ్మం. క్లాసంతా వెనక్కి తిరిగి చూసింది.

ఆ సమాధానం చెప్పింది ఆనందరావు.

ఆనందరావు తన క్లాసులో వుండడం చూసి ఆశ్చర్యపోయాడు పరబ్రహ్మం.

"ఏమిటి గురువుగారు పొరపడుతున్నారు. ప్రేమంటే ప్రేమించిన అమ్మాయిని పెళ్ళిచేసుకోడం అనబోయి పెళ్ళి చెయ్యడం అన్నారు" ఒక అబ్బాయి సవరించబోయాడు.

"కాదు. ఆ వయసులో ప్రేమించిన అమ్మాయికి ఏం న్యాయం చేస్తారు. అందువల్ల ఆ అమ్మాయిని ఇంకొకరికి చెయ్యడమే ప్రేమ అన్నారు గురువు

గారు. వారి దృష్టిలో ప్రేమంటే త్యాగం" ఇంకొకతను కల్పించుకున్నాడు.

ఆనందరావు మాట్లాడలేదు. అలాగే నించున్నాడు.

"ఇక క్లాసు చాలు"

ప్రేమిస్ట్రీ ప్రొఫెసర్ క్లాసు ఆపేసాడు. అందరూ బయటకి వెళ్ళి పోయారు.

మోటారుసైకిళ్ళు, స్కూటర్లు చప్పుడు చెయ్యడం మొదలెట్టాయి. బయట నిలబడ్డ టయోటా కారుని చూసి ఆశ్చర్యపోయారు ఆ కుర్రాళ్లు. అయిదు నిమిషాల్లో అక్కడ నిశ్శబ్దం నెలకొంది.

పరబ్రహ్మంవెంట ఆఫీసు రూంలోకి వెళ్ళాడు ఆనందరావు.

"ఏమిటి నోటీసు లేకుండా ఇలా వచ్చావు" అడిగాడు పరబ్రహ్మం.

"నీ అవతారం చూద్దామని. ఏమిటి సైకో ఎనలిస్టువి సెక్సాలజిస్టుగా మారిపోతున్నావా"

"పొరపాటు. యువతీయువకులకి సెక్స్‌ని సక్రమంగా బోధించవలసిన అవసరం వుంది. కాని నేను చెప్పేది సెక్స్ కాదు. ప్రేమిస్ట్రీ. సెక్స్ ఎడ్యుకేషన్ ప్రేమిస్ట్రీలో ఒక భాగం మాత్రమే, సరే రా నీ సమస్య ఏమిటి పెళ్ళికి ముందు సమస్యా, పెళ్ళి తర్వాత సమస్యా"

"ఈ వయసులో ఇంకా పెళ్ళికి ముందు సమస్య వుంటుందా" బట్టతల తడుముకుంటూ అన్నాడు ఆనందరావు.

"అదే పొరపాటు. అంటే ఇంత అనుభవం సంపాదించిన తర్వాత కూడా నువ్వు ప్రేమ అంటే సెక్స్ అనుకుంటున్నావన్నమాట. అందువల్లే వయసు ప్రసక్తి తెస్తున్నావు. ముసలితనం శరీరానికేకాని మనసుకి కాదు. ఏ వయసులోనేనా ప్రేమించవచ్చు. ప్రేమిస్ట్రీ చెప్పేది ఇదే. ఇప్పుడేనా అర్ధమైందా సెక్సాలజీకి ప్రేమిస్ట్రీకి గల తేడా"

"సరె నీ ఉపన్యాసం ఆపి సలహా చెప్పు"

పరబ్రహ్మం సైపు ముక్తించాడు. రివాల్వింగ్ ఛైర్లో గిర్రున తిరిగి "చెప్పు" అన్నాడు.

"నాకు ఇప్పుడు జీవితంలో పెద్ద సమస్య వచ్చింది. నేను ప్రేమించిన అమ్మాయికి పెళ్ళి చెయ్యాలి"

"ఎవరా అమ్మాయి" కళ్ళజోడులోంచి చిత్రంగా చూస్తూ అడిగాడు పరబ్రహ్మం.

"స్వప్న"

"వ్వాట్ స్వప్నా. అప్పుడే స్వప్నకి పెళ్ళా"

"ఇప్పుడు కాకపోతే ఇంకెప్పుడు చెయ్యమంటావు. అయినా పెళ్ళి పెటాకులు లేనివాడివి నీకెలా అర్ధమవుతుంది. ఈ రోజుల్లో అమ్మాయిల్ని చూడు.

'పెళ్ళి చేసుకో అమ్మా' అని అడిగితే 'ఇప్పుడే ఎందుకు, ఇంకా చదువుకుంటాం, ఉద్యోగం చేస్తాం' అంటారు. తీరా వాళ్ళకి పెళ్ళి చేసుకోవాలన్న కోరిక కలిగేసరికి వాళ్ళు పెద్దవాళ్ళయిపోతున్నారు. వయసులో, స్టేటస్‌లో వాళ్ళకన్నా పెద్దవాడు దొరక్క, అంతకన్నా చిన్నవాణ్ణి చేసుకోలేక ఫ్రస్ట్రేటై అలాగే బీడుల్లా, మోడుల్లా మిగిలిపోతున్నారు. అందువల్ల స్వప్నకి ఇప్పుడే పెళ్ళి చెయ్యాలనుకుంటున్నాను."

"స్వప్న ఏమంటోంది"

"ఏమీ అనటంలేదు. దాటేస్తోంది"

"అలా అమ్మాయి పెళ్ళిమాట దాటేస్తోందంటే నాకో అనుమానం. ఎవర్నైనా ప్రేమించిందేమో. నువ్వు కాస్త మంచి మూడ్‌లో వున్నప్పుడు చెప్తుంది వెయిట్ చెయ్యి"

"అలా అయితే సమస్యేముంది. స్వప్న ఎవర్నైనా ప్రేమిస్తే, వాడెంత తలమాసినవాడైనా వాడికిచ్చి చేస్తాను. దాని ఇష్టమే నా ఇష్టం. దాని సుఖమే నా సుఖం."

"ఆ మాట నీలో నువ్వు అనుకుంటే సరిపోతుందా. స్వప్నకి తెలియద్దూ- ఎవర్నైనా ప్రేమించానని చెప్తే నువ్వేమనుకుంటావో అని చెప్పడానికి సంశయిస్తూ వుండచ్చు. నెమ్మదిగా అడిగి తెలుసుకో"

"అదికాదురా. 'ఏ కుర్రాడేనా నీ మనసులో వుంటే నిస్సంకోచంగా చెప్పు. నేనే చొరవ తీసుకుని మీ పెళ్ళి చేస్తాను' అని ఎన్నోసార్లు స్వప్నకి చెప్పాను"

"ఏమంది"

"అదేంలేదు నాన్నా అంటోంది"

"పోనీ అలా అయితే నువ్వే ఏదో మంచికుర్రాణ్ణి తీసుకొచ్చి చూపించు"

"రెండుసార్లు ఆ ప్రయత్నమూ చేశాను. 'ఈ పెళ్ళిచూపులు తతంగం నాకు నచ్చదు నాన్నా. నువ్వు ఎక్కడో వింటావు. ఎవర్నో తీసుకొస్తావు. అతను వస్తాడు. పది నిమిషాలు చూస్తాడు. మొహమాటపడుతూ నాలుగు మాటలు మాట్లాడ్తాడు. ఆ కాసేపట్లో అతని గురించి నాకుగాని నా గురించి అతనికిగాని ఏం తెలుస్తుంది. ఎలా తెలుస్తుంది. ఏమీ తెలుసుకోకుండానే టాస్ వేసి అవునో కాదో తేల్చుకోవాలి. అపరిచిత వ్యక్తితో జీవితం పంచుకోడానికి అంగీకారం తెలియజెయ్యాలి. ఆ తర్వాత ఏం జరుగుతుంది అన్నది అదృష్టంమీద ఆధార పడుతుంది. నచ్చినా నచ్చకపోయినా జీవితాంతం సర్దుకుపోవాలి. దానికి నేను సిద్ధంగా లేను' అంది"

"సెభాష్ నా పాయింటూ అదే. అమ్మాయి, అబ్బాయి ఒకరినొకరు అర్థం చేసుకున్న తర్వాతకాని పెళ్ళి చేసుకోకూడదు. ముందు ప్రేమ, తర్వాత




పెళ్ళి. అదీ నా సిద్ధాంతం."

"ఏరా, ముందు పెళ్ళి చేసుకుని ఆ తర్వాత ప్రేమించేవాళ్లు మన సమాజంలో ఎంతమంది లేరు. వాళ్ళు సుఖంగా వుండటంలేదా"

"ఉండచ్చు. దానికి కారణం-వాళ్ళ అదృష్టం కావచ్చు. లేదా ఏం జరిగినా సరిపెట్టుకుందాం అనే వాళ్ళ మనస్తత్వం కావచ్చు, దేవుడిమీద భారంవేసి 'నీట ముంచినా పాల ముంచినా నీదే భారం' అని దణ్ణం పెట్టి ఊరుకునే తత్వం కావచ్చు. అది వెనకటి తరం దృక్పథం. కాని మా జీవితం మా చేతుల్లో వుంది. దాన్ని మా ఇష్టం వచ్చినట్టు తీర్చి దిద్దుకుంటాం. మా కష్టాలకీ, మా సుఖాలకీ మేమే బాధ్యులం అనుకునే ఈ తరం పిల్లలకి పాత పద్ధతులు నచ్చవు. ప్రేమ అనేది అందమైన అనుభవం. కొందరికే అది లభ్యమవుతుంది. స్వప్న దాన్ని కావాలని కోరుకుంటే నువ్వు అడ్డు పడకు"

"స్వప్నకి నచ్చని పని ఏదీ చెయ్యాలన్న కోరిక నాకు లేదు. నా బాధ ఒక్కటే. మన సమాజం ఇంకా మారీ మారని స్థితిలో వుంది. పెళ్ళికి ముందు యువతీ యువకులకి పరస్పర అవగాహన కావాలంటాం అందరం. అయితే పాశ్చాత్య దేశాల్లోలా పెళ్ళి కాకముందు అబ్బాయి అమ్మాయి చెట్టా పట్టా లేసుకుని తిరగడాన్ని, డేటింగ్‌ని మనం ఆమోదించం. అంతెందుకు ఏ దురభిప్రాయం లేకుండా అబ్బాయి అమ్మాయి స్నేహంగా మాట్లాడుకుంటే ముక్కుమీద వేలేసుకుని దవడలు నొక్కుకుంటుంది మన సమాజం. మన పిల్లలు

వుంటున్నది ఇండియాలో. వాళ్ళ కలల్నిండా కెనడాలు, అమెరికాలు. వీటికి ఎలా పొంతన కుదురుతుంది. ఈ వ్యవస్థలో అవి ఎండమావులు. స్వప్న వాటివెంటపడి ఆశాభంగం చెందుతుందేమో అన్నదే నా బెంగ."

"నా బెంగా అదే. ఏవో నవలలు చదివి, సినిమాలు చూసి, ప్రేమంటే అదో ఈస్టమన్ కలర్ సినిమాలా వుంటుందనుకుంటారు చాలామంది అమ్మాయిలు, అబ్బాయిలు. ఓ అమ్మాయి చీరెను చూసో, లేదా ఆ అమ్మాయి చేతిలోని బొచ్చుకుక్కని చూసో అమాంతం ఆ అమ్మాయిని ప్రేమించి తీరా ఆ అమ్మాయి కాదనగానే మంచం పట్టే అబ్బాయిలున్నారు. అలాగే ఓ అబ్బాయి పాడిన పాట వినో, రాసిన కథ చదివో అతన్నే తమ హీరోగా ఊహించుకుని, ఆ అబ్బాయి కాదనగానే సుయ్యో గొయ్యో చూసుకునే అమ్మాయిలూ వున్నారు. ప్రేమంటే ఇలా క్రేజ్ కాదని, జీవితాన్ని సుఖంగా నడిపించే ఒక ప్రాక్టికల్ సైన్స్ అని అందరికీ చెప్పాలన్నదే నా కోరిక. అదే ప్రేమిస్ట్రీ లక్ష్యం" పరబ్రహ్మం ఆవేశంగా అన్నాడు.

"నువ్వు చెప్పేది వింటే నాకు భయం వేస్తోంది. నేను ఎవరేనా మంచి కుర్రాణ్ణి చూపించి, నువ్వితన్ని తప్పకుండా చేసుకో అమ్మా అని గట్టిగా చెపితే స్వప్న తప్పకుండా చేసుకుంటుంది. కాని నాకది ఇష్టం లేదు. స్వప్న జీవితం ఆమె కోరుకున్నట్టుగా గడవాలి. తన జీవిత భాగస్వామిని తనే ఎన్నుకోవాలి. అయితే పొరపాటు చెయ్యకుండా తనకి సరిపోయేవాణ్ణి ఎన్నుకోవాలన్నదే నా ఆరాటం. ఎక్కడ తప్పటడుగు వేస్తుందో అన్నదే నా భయం. అందుకే నీ సలహాకోసం వచ్చాను" ఆనందరావు కుర్చీలో ముందుకి వంగాడు. సీరియస్‌గా వున్నాడతను.

"ఏ అమ్మాయి తనకి అన్నివిధాలా తగినవాణ్ణి ఎన్నుకుని, అతన్ని ప్రేమించేలా చెయ్యడానికి నీ సహాయం అవసరం అయితే చేస్తావా" అడిగాడు పరబ్రహ్మం. ఆనందరావు తెల్లబోయాడు.

"నేనా! ఆ విషయంలో సహాయం చెయ్యడమా? ఎలా"

"చెప్తాను. అయితే దీనికి ముందు నేను స్వప్నతో మాట్లాడాలి. ఆమెని ఎనలైజ్ చెయ్యాలి. అఫ్‌కోర్స్ పడుచు హృదయాన్ని ఎనలైజ్ చెయ్యబోయి ఎందరో ఫెయిలయ్యారు. కాని ప్రయత్నిస్తాను. ఆ తర్వాత సలహా చెప్తాను."

"ఎప్పుడు"

"కావాలంటే ఇప్పుడే. అయితే నేను ఎనలైజ్ చేస్తున్నానన్న సంగతి స్వప్నకి తెలియకూడదు. స్వప్నకి నామీద నమ్మకం కలిగి, నా సలహా మూలంగా ఉపయోగం వుంటుందని అనిపించినప్పుడు ఆమెకి ఈ సంగతి నేనే చెప్తాను"

"స్వప్న ఊళ్లో లేదు. స్నేహితురాల్ని చూడ్డానికి ఊరెళ్ళింది. వచ్చే

వారం స్వప్న పుట్టినరోజు. పార్టీకి వచ్చినప్పుడు ఆ అవకాశం ఉపయోగించుకో"

"సరే" అన్నాడు పరబ్రహ్మం.

"నే వస్తా" ఆనందరావు బయల్దేరాడు. పరబ్రహ్మం సాగనంపాడు.

o o o o

ఝుక్ ఝుక్ మంటూ రైలు స్టేషన్లో ఆగింది. ఫస్ట్ క్లాసు కంపార్టుమెంటు లోంచి దిగింది స్వప్న. ఎగురుతున్న ముంగురుల్ని మోచేత్తో వెనక్కి తోసుకుంది. అలసటగా వుంది ఆమె ముఖం.

రాత్రి పదిన్నరయింది. స్టేషన్లో చాలా లైట్లు పనిచెయ్యటంలేదు. ఒకరిద్దరు పోర్టర్లు కూలీ కావాలా అంటూ ముందుకు వచ్చి స్వప్న సమాధానం చెప్పకపోడంతో ముందుకు వెళ్ళిపోయారు. మెన్న మూట్ వేసే వుమ్బ్రకుని ముందుకి నడిచింది. ఆమె నడుస్తున్నప్పుడు భుజానికి వేలాడుతున్న వానిటీ బాగ్ ఊగుతూ ఆమె నడుముకి తగులుతోంది.

"మాలతి వాని ప్రజీత్ వాని స్టేషన్‌కి వస్తారా" అని ఒక్క క్షణం ఆమె మనసు ఆశపడింది. ఎలా వస్తారు, తను రైలు ఆలస్యం అవడంతో కనెక్టింగ్ రైలు తప్పిపోయి ఈ డొక్కు బండిలో రాత్రిపూట దిగింది. పాపం వాళ్ళు పొద్దున్నంతా స్టేషన్లో చూసిచూసి ఇంటికి వెళ్ళిపోయుంటారు. కొత్త ఊరు, మొట్టమొదటిసారి రావడం. బెంకుగా వుంది స్వప్నకి.

స్నేహితురాలి కొత్తకాపురం చూద్దామని, దాంతో నాలుగు రోజులు సరదాగా గడుపుదామని వచ్చింది తను. రాత్రిపూట స్టేషన్లో చిక్కుకుపోయింది. ఎడ్రస్ తప్ప తనదగ్గర వేరే వివరాలు ఏవీ లేవు.

"సరేకాని, దబాయిస్తే సరి. దేవుడు మనిషికి నోరిచ్చిందందుకే. తనకి ఊరు తెలియదని ఏ రిక్షావాడికేనా తెలిస్తే చాలు. నాలుగు డబ్బులకోసం తనని ఇరుకులో పెట్టడానికి చూస్తాడు. అదే తను ఈ ఊరు మనిషే అయినట్టే ప్రవర్తిస్తే వాడే భయపడి ఆ ఇంటిముందు వదిలేస్తాడు. సైకలాజికల్ వార్ అంటే ఇదే"

స్వప్న టికెట్ కలెక్టర్‌కి టిక్కెట్టు ఇచ్చి ఓ అడుగు ముందుకేసి తటపటాయింపుగా ఆగిపోయింది. వెనక్కి తిరిగి టికెట్ కలెక్టర్ని 'శ్రీనగర్ ఎక్కడ' అని అడిగింది.

"మీరు ఎవరి ఇంటికి వెళ్ళాలి"

వానిటీ బాగ్‌లోంచి ఎడ్రస్ కాగితం తీసి చూపించింది.

"ఇదా, జవహర్ స్కూల్‌దగ్గర అని చెప్పండి. ఆ ఏరియాలో అడిగితే చెప్తారు. మీరు ఈ ఊరుకి కొత్తా? ఒంటరిగా వచ్చారా" అడిగాడతను.

(సశేషం)

# యండమూరి వీరేంద్రనాథ్

సీరియల్

# డబ్బు

# డబ్బు

(జరిగిన కథ)

(కొన్ని ముఖ్యమైన, రహస్యమైన అంకెలు గల పుస్తకం, గాంధీ పరిశ్రమ ప్రాణం కోసం హనుమంతరావు వద్ద లక్ష్మి క్రమంగా పలకరించి పోయ మయ్యాడు-ఆ అంకెలతో గాంధీ జీవితాన్ని మాయం చేయగల రామ్మోహనరావు సంసిద్ధమయ్యాడు-అంజిరెడ్డి గాంధీకి అభయం ఇచ్చాడు పోయిన పుస్తకం గురించి. అసలు నిజంగానే హనుమంతరావు మాయమయ్యాడు అంజిరెడ్డి ఆధ్వర్యంలో. గాంధీ ప్రాణికి పోయాడు ఈ తంత్రానికి! గాంధీకి, అంజిరెడ్డికి తెలిసి పద్ధతిలో రహస్యదేవి రామ్మోహన్‌రావుకి చేరింది-పత్రమైన లక్ష్మి వ్యామోహప్రసక్తితో సహా..)

—ఇక చదవండి—

# 25

శివ కైలాష్ బ్యాంక్ జాతీయం చేయబడ్డ తరువాత దాని పాత డైరెక్టర్లకి పదవులు పోయినయ్. అందుకే లక్ష్మి, పేపర్ మిల్లులో ఉద్యోగం సంపాదించుకుంది. అయితే టాటూవాలా మాత్రం ఢిల్లీలో నెలరోజులు కూర్చొని, కొత్త బ్యాంకులో డైరెక్టర్ షిప్ సంపాదించాడు.

ఎవరూ ఊహించని విషయం ఏమిటంటే- మరో పదవి రామ్మోహనరావుకి రావటం.

"ఇంతకాలం తెర వెనుక నుండి రాష్ట్ర ఆర్థిక పరిస్థితుల్ని ఆడించిన రామ్మోహనరావు ఇకనుంచీ నేరుగా రంగంలోకి దిగదల్చుకున్నాడన్న మాట" అనుకున్నారు దగ్గిర వాళ్ళు. అతనికి ఈపదవి వచ్చిందని తెలిసినప్పుడు అతడు స్విట్జర్లాండులో వున్నాడు. అక్కడికే కంగ్రాట్స్ చెబుతూ కేబుల్స్ వెళ్ళినయ్.

ఒక రకంగా ఇది అంజిరెడ్డి వర్గానికి ఓటమి.

బ్యాంకుని జాతీయం చేయించి రామ్మోహనరావ్‌కి గుండె నొప్పి తెప్పించిన విజయోత్సాహం చల్లారక ముందే అతను గవర్నమెంటు బ్యాంకుకి డైరెక్టరు అయ్యాడన్న వార్త రావటం గొడ్డలి పెట్టే. ఆ రాత్రి దాదాపు రెండ వందల ఫోన్లు గంటలు కొద్దీ పని చేసినయ్ ఎన్నో రహస్యమంతనాలు జరిగినయ్

(ఎనిమిదో తరగతి సోషల్ స్టడీస్‌లో ఒక ప్రశ్నవుంది. పరిశ్రమల జాతీయకరణ వలన లాభములేమి?-అని దానికి కుర్రవాళ్ళు "దీని వల్ల డబ్బు అందరికీ సమానముగా పంచబడును. బలహీన వర్గాలకు ఉద్యోగములు లభించును, దేశ ప్రగతికి ఇది తోడ్పడును"-వగైరా నాన్సెన్సికల్ జవాబులు వ్రాస్తారు. ఏకారణంవల్ల ఇలాంటి పనులు జరుగుతాయో, ఎన్ని లక్షలు చేతులు మారతాయో- రాజకీయరంగంలో ఏ మార్పులకు ఇది దోహదం చేస్తుందో ఏ పాఠాల్లోనూ చెప్పరు. ప్రజలు కూడా గుడ్డెద్దు చేలో పడ్డట్టే ఎలక్షన్స్ సమయంలో ఈ పరిణామాలకి పెద్ద ప్రాముఖ్యత ఇవ్వకుండానే ఓటు వేస్తూవుంటారు)




కేంద్ర ఆర్థిక శాఖ తయారు చేసిన డైరెక్టర్ల లిస్టులో ఆఖరి క్షణంలో ఒక పేరు కొత్తగా చేర్చబడింది. ఈ పేరు చేర్పించటం కోసం రాష్ట్ర విద్యాశాఖామంత్రి ఒక బ్రీఫ్ కేసుతో సాయంత్రానికి సాయంత్రం ఢిల్లీ వెళ్ళవలసి వచ్చింది. పార్టీ ఫండ్ కోసం పేపర్ మిల్స్ అసోసియేషన్ వాళ్ళు (ఆ అసోసియేషన్ ఏమిటో, ఎప్పుడు ఎందుకు స్థాపించబడిందో ఎవరికీ తెలీదు) అయిదులక్షలు డొనేషన్ ఇచ్చారు. నిజానికి చాలా తక్కువ డబ్బు ఇది. కాని మంత్రివర్గంలో రాబోయే మార్పుల దృష్ట్యా విద్యాశాఖా మంత్రి ఈ పని చెయటానికి ఒప్పుకోక తప్పలేదు.

ఈ పేరు చేర్పించటానికి చాలా కష్టపడ వలసి వస్తుందనుకున్నాడు విద్యాశాఖామంత్రి. కాని సుహార్తో చౌదరి పెద్దగా ఆటంకాలు పెట్టకుండానే దాన్ని ఒప్పుకొన్నాడు.

రామ్మోహనరావు స్విట్జర్లెండు నుంచీ వచ్చే సమయానికి ఈ పరిస్థితులన్నీ ఒక రూపుదాల్చుకున్నాయి. అతడి పరపతి దాదాపు అయిదురెట్లు పెరిగింది. ఆ సాధించిన విజయం తక్కువదేమీకాదు. ఎవరో పెద్ద పెద్ద వాళ్ళు ఆ పదవి కోసం ప్రయత్నిస్తూవుంటే ఎక్కడో స్విట్జర్లాండులో వుండి అతి సునాయాసంగా ఈ డైరెక్టర్ షిప్ సంపాదించాడూ అంటే అది సామాన్య విషయం కాదు. అతడి ఈ విజయంతో పేపర్ పరిశ్రమలో అప్పటివరకూ అంజిరెడ్డిని సపోర్ట్ చేస్తున్నవాళ్ళలో కొంతమంది, తమ అభినందనలు రామ్మోహనరావుకి తెలుపటంద్వారా అతడివైపు తిరిగిపోయినట్టు పరోక్షంగా ప్రకటించారు.

ఈ పరిణామం గాంధీకి పెద్ద షాక్.

ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్టయింది.

పూర్వం శివశైలాన్ బ్యాంకు రామ్మోహనరావుది కాబట్టి తన పేపరు మిల్లు సంగతి తెలియకుండా జాగ్రత్తపడ్డాడు. అదృష్టవశాత్తు అది జాతీయం చేయబడింది. సంతోషంతో ఎగిరిగంతులేసేడు. కానీ ఇప్పుడు మళ్ళీ ఇంకోదెబ్బ రామ్మోహనరావే ఆ బ్యాంకుకి డైరెక్టర్ అయ్యాడు. తనని నల్లిని నలిపేసినట్టూ నలిపేస్తాడు ఇక.

అంత విషాదంలోకూడా గాంధీకి నవ్వొచ్చింది. డబ్బుసంపాదనలో ఏక్షణం ఆనందమో-ఏ క్షణం విషాదమో ఎవరికీ తెలీదనుకుంటూ. కొద్దిగా మబ్బొస్తే చింత పండుధర ఏమవుతుందా అని కంగారు పడాలి కొద్దిగా వర్షంవస్తే బియ్యం ఏమవుతుందా అని విచారించాలి.

గాంధీ ఈ విషయమై అంజిరెడ్డిని కలుసుకున్నాడు అతడూ ఈ పరిణామానికి కొద్దిగా చలించనట్టు కనబడ్డాడు

"బ్యాంకు రామ్మోహనరావు ఆధీన-లోకి వెళ్ళేటట్టువుంది. ఏం చేద్దాం" అని అడిగాడు గాంధీ.

"అది చాలా చిన్న సమస్య ఇంతకన్నా పెద్ద గొడవ ఇంకొకటి వుంది" అన్నాడు అంజిరెడ్డి.

"ఏమిటి?"

"స్విట్జర్లాండు వే రామ్మోహనరావు ప్రధానమంత్రితో మాట్లాడాడనీ, ప్రధానమంత్రికి స్విడ్జర్లాండు బ్యాంకులోవున్న అకౌంట్‌లో కొన్ని లక్షల డబ్బు జమ చేసాడనీ, దానికిప్రతిగా ప్రధానమంత్రికి ఈ సాయం చేసేడనీ రూమరొకటి తొందర తొందరగా పాకిపోతూంది."

"అది అతడి ప్రతిష్టకే భంగంకదా" అని అడిగాడు గాంధీ."—డబ్బుతో పదవి కొనుక్కున్నాడన్న రూమరు పాకటం...."

"నైతికంగా అది అతడికి దెబ్బ అవుతే అవ్వొచ్చు. కానీ స్విట్జర్లాండు బ్యాంకూ, ప్రధానమంత్రితో అక్కణ్ణుంచే మాట్లాడటం - ఇవన్నీ అతడు ప్రధానమంత్రికి చాలా సన్నిహితుడన్న అర్థాన్ని ఇస్తున్నాయి. దీంతో రాష్ట్ర రాజకీయాల్లో అప్పుడే సంచలనం కూడా కలుగుతుంది. రామ్మోహనరావు దిగుతున్న విమానం దగ్గరకి మంత్రులు దండల్తో వెళుతున్నారు. విమానాశ్రయం నుంచి ముఖ్యమంత్రి కారులో డైరెక్టుగా బ్యాంకు మీటింగ్‌కి వెళ్తున్నాడు అతడు....నాల్గురోజుల తరువాత జరగబోయే ఈ ప్రోగ్రాం ఇప్పుడే ఇంత పకడ్బందీగా ప్లాన్ చేయబడింది. ముఖ్యమంత్రీ ఇతడూ కలిసి కారు ఎక్కుతూ వుండగా ఫొటో తీసి దాన్ని దినపత్రిక మొదటి పేజీలో వేసి-పైన నేను చెప్పినదంతా వ్యాసంగా రాయటానికి ఒక జర్నలిస్టుకి రెండువేలు లంచంగా ఇవ్వబడింది. రామ్మోహన్‌రావు స్విట్జర్లాండు ఎందుకు వెళ్ళాడు అన్న హెడ్డింగ్‌తో ఈవార్త పెద్దఅక్షరాల్తో రాబోతుంది. ప్రధానమంత్రి లంచగొండా? అని ఇంకో పత్రిక హెడ్డింగ్ పెడుతుంది."



"మైగాడ్. ఇంత ప్లానింగ్ జరుగుతూ వుందా?" అన్నాడు గాంధీ.

"మరి?" అన్నాడు అంజిరెడ్డి "ఆ దిన పత్రిక ప్రభుత్వాన్నీ, ప్రధానమంత్రినీ ముఖ్యమంత్రినీ పీకి పారేస్తుంది. అందాలుండని పదవులిచ్చిన ఈ ప్రభుత్వం ఎంత హీనమైనదో ఎడిటోరియల్ వ్రాస్తుంది. దాన్ని చదివి జనం ఆహా ఎంత నిజాయితీ వున్న పత్రిక ఇది ప్రభుత్వానికి కూడా భయపడకుండా తిడుతూ దాని లొసుగుల్ని బైటపెడ్తుంది. ఎవరికీ తెలియని రహస్య వార్తల్ని కూడా పైకిలాగి ప్రచురిస్తుంది" అనుకుంటారు. కానీ ఇన్‌డైరెక్టుగా రామ్మోహనరావు పేరుకి ప్రాచుర్యం లభించేలా ఆ వ్యాసం వ్రాయబడింది అని గ్రహించలేరు. ప్రభుత్వం ప్రభుత్వంలాగే వుంటుంది. పత్రికలు దాన్ని తిడుతూ సొమ్ము చేసుకుంటూనే వుంటాయి. ప్రజలు ఆ ప్రభుత్వాన్నే ఎన్నుకుంటూ వుంటారు ఇదంతా రొటీను. దాని సంగతి వదిలిపెట్టు. ఇప్పుడు మనం వెంటనే నెరవేర్చవలసిన కర్తవ్యం ఏమిటంటే శివశైలస్ బ్యాంకులో రామ్మోహన రావు ప్రాచుర్యం తగ్గించాలి. పత్రికల్లో ఇక డైరెక్టుగా అతని పేరు తిట్టబడినా, అందవలసిన వాళ్ళకి సూటిగా అతడి పరపతి పెరుగుతున్న సంగతి అందుతుంది. దాన్ని మనం అడ్డుకోవాలి. బైబై సీ దగ్గిర ఎంత బి.వుంది?" (బి. అంటే బ్లాక్).

"ఒక గ్రాండ్" (ఒక లక్ష).

"చాలా తక్కువ".

గాంధీ మాట్లాడలేదు. అంజిరెడ్డి అన్నాడు. "....నేనో మూడు ఇస్తాను. ఐ. ఓ. యూ. లేకుండా తరువాత ఎడ్జెస్టు చెయ్యి".

పెద్ద వాళ్ళలో ప్రామిసరీ నోట్లూ-అప్పు పత్రాలూ వుంటవు. డబ్బు అకౌంట్లలో మార్చబడుతుంది. ఇప్పుడు మూడు లక్షలు తనకి "అప్పు" ఇచ్చి-తన ద్వారా ప్రత్యర్థిని దెబ్బతీద్దామనుకుంటున్నాడు అంజిరెడ్డి. రెండు విధాలా అతడికి లాభమే. ఇలాటి ఎత్తులు వేయ గలడు కాబట్టే అంత తొందరగా జీవితంలో పైకి రాగలిగాడు అనుకున్నాడు గాంధీ.

"మనం డబ్బు విద్యామంత్రిద్వారానే ఎందుకు పంపాలి. మనమే ఢిల్లీ తీసుకు వెళ్ళొచ్చుగా".

అంజిరెడ్డి నవ్వాడు. "రామ్మోహనరావు వేసిన ఎత్తుతో మన మంత్రికికూడా మన మీద నమ్మకం తగ్గుతున్నట్టుంది. ఓ నాలుగు లక్షలు అతడికి ఇచ్చి పంపటం ద్వారా-"నీ మీద మాకు ఎంత నమ్మకమో చూసేవా" అని పరోక్షంగా చెబుతున్నామన్న మాట. దీంతో కొంతకాలమైనా ఇతడు మనవైపు వుంటాడు. ఈ లోపులో మన శక్తి సామర్థ్యాలు ఋజువుపర్చుకోవాలి."

గాంధీ కుర్చీలోంచి లేస్తూ 'అర్థమైంది' అన్నాడు. "మూడు లక్షలూ నా తరఫున, అప్పు వ్రాసుకోండి"

• • • • • • •

శివకైలాస్ బ్యాంక్ చరిత్రాత్మకమైన మొట్టమొదటి బోర్డు మీటింగు ఆరోజు ఉదయం పదిగంటలకి ప్రారంభం అయింది. ఎనిమిదిన్నరకి విమానం దిగి రామ్మోహనరావు ముఖ్యమంత్రి నివాసానికి వెళ్ళి అనుకున్నట్టే పదింటికి బోర్డు రూము చేరుకున్నాడు. ఒకరికొకరు కరచాలనాలు ఇచ్చుకున్నారు ఒకర్నొకరు పైకి కనబడకుండా పరిశీలించుకున్నారు. నేను సీఈది చేస్తే-నువ్వు నాకది చేసేవాడివేనా అన్నట్టు చూపుల్తో పరీక్షించుకున్నారు

చైర్మన్ పక్క సీట్లో రామ్మోహనరావు కూర్చున్నాడు. అతడి పక్కసీట్లో ప్రభుత్వం తరఫున డైరెక్టర్ శ్యామ్ అతడి పక్క రిజర్వు బ్యాంకు డైరెక్టర్ ప్రకాష్ మెహ్రా అతడి పక్కగా టాటావాలా వున్నారు. మొత్తం తొమ్మిదిమంది. పదో డైరెక్టర్ ఇంకా రాలేదు. సమయం పదిగంటల రెండు నిముషాలైంది. చైర్మన్ కుర్చీలోంచి లేచి గొంతు సవరించుకొని ప్రారంభోపన్యాసం ప్రారంభించాడు.

"ఫ్రెండ్స్.... ఈరోజు ఎంతో గొప్పదినం మనం ఇలా ఇక్కడ కలుసుకోవటం నాకెంతో ఆనందంగా వుంది. ఇంతవరకూ ప్రైవేట్‌గంగంలో వుంటూవచ్చిన ఈ సంస్థ ఈనాడు ప్రభుత్వ సంస్థగా మారింది. బలహీనవర్గాలకు సాయంచేసే వీలు కలిగించినందుకు మనం ప్రభుత్వానికి కృతజ్ఞతలు చెప్పుకోవాలి—" ఇలా అర్థం పర్థంలేని వాక్యాల్తో కొంచంసేపు ప్రభుత్వాన్నీ, కొంత సేపు ప్రధాన మంత్రినీ పొగిడాడు. తరువాత ఇది చెయ్యాలి. అది చెయ్యాలి. పొడిచెయ్యాలి అంటూ ఉపన్యాసం కొనసాగించాడు. ఇదంతా దేముడిముందు పూజారి చదివే మంత్రాలకన్నా ఎక్కువ విలువ లేనిదన్న విషయం అక్కడ అందరికీ తెలుసు.

అన్నిరకముల ఆపరేషన్స్ చేయు చోటు
మవిల్ నర్సింగ్ హోమ్! విజయవాడ-2. !!



"ఎలావుంది పేపరు ఇండస్ట్రీ?" అని అడిగాడు శ్యామ్, రామ్మోహనరావుతో తగ్గు స్వరంతో-

"చాలా పెద్ద సంక్షోభాన్ని ఎదుర్కోబోతుంది, డబ్బు సరిఅయిన సమయంలో అందకపోతే పూర్తిగా మునిగిపోతుంది. మన బ్యాంకే సాయపడాలి...."

ఇంతలో చైర్మన్ ఉపన్యాసం పూర్తయింది. అతడు కూర్చోబోతూంటే ప్యూన్ చిన్న చీటీ తెచ్చి ఇచ్చాడు. అది చదివి ఆయన మళ్ళీ కుర్చీలోంచి లేస్తూంటే తలుపు తెరుచుకుంది. "మన బ్యాంకు పదో డైరెక్టరు వస్తున్నారు" అంటూ తలుపు దగ్గిర నిల్చున్న వ్యక్తిని చూసి, ఆహ్వానిస్తున్నట్టు, "వెల్‌కమ్" అన్నాడాయన.

బ్యాంక్ పదో డైరెక్టర్ గుమ్మందగ్గిర చిరునవ్వుతో నిలబడివున్నాడు. ఆ సమయానికి రామ్మోహనరావు పక్కకివంగి శ్యామ్‌తో మాట్లాడుతున్నాడు. అందరితో పాటూ తలతిప్పి చూసిన అతడు అలాగే స్తబ్దంగా వుండిపోయాడు. మొహం మీద చిరునవ్వు మాయమైంది అలా ఎంతసేపు వున్నాడో తెలీదు. నిస్సహాయతా-కోపమూ పెనవేసుకున్న భావంతో మొహం ఎర్రబడింది.

గాంధీ వచ్చి తనసీటులో కూర్చొన్నాడు.

మీటింగు ప్రారంభం అయింది.

ఒక్కొక్క అంశమే చర్చకి వస్తూంది, అయిపోతూంది. పెద్ద విభేదాలు లేకుండానే జరిగిపోతూంది.

రామ్మోహనరావు మొదటి షాక్ నుంచి తేరుకున్నాడు. ఆలోచిస్తే తనభయం

అర్థంలేదనిపించింది. బోర్డులో అందరూ తనవాళ్ళే. ఈ పదవికోసం గాంధీ ఎంతో ఖర్చుపెట్టి వుంటాడు. అదంతా బూడిదలోపోసిన పన్నీరు కాబోతూంది.

అతడికి నవ్వొచ్చింది ఇంత తెలివితక్కువ ఎత్తు గాంధీ ఎందుకు వేసాడా అని నవ్వుకున్నాడు.

లంచ్‌కోసం బోర్డు వాయిదా పడింది.

ఆ సమయంలో గాంధీకి ఫోన్ వచ్చింది అంజిరెడ్డినుంచి-"ఎలావుంది కొత్త పదవి?"

గాంధీ నవ్వి, "బానేవుంది కానీ రామ్మోహనరావు మనం అనుకున్నంతగా బెదిరిపోలేదు. అనవసరంగా నాలుగు గ్రౌండులు వేస్టుచేసేవేమో అనిపిస్తూంది."

"మన సమస్య చర్చకి వచ్చిందా?"

"ఇంకా రాలేదు. ఇప్పుడు వస్తుందనుకుంటా" అని ఫోన్‌పెట్టేడు. సరిగ్గా మూడున రకి వచ్చిందది.

"పేపరు రిటైలర్స్ (చిల్లర అమ్మకందార్లు) కి విరివిగా అప్పులివ్వాలనీ - బ్యాంకు తాలూకు డబ్బు ఆ మార్గంలో ఎక్కువ పయనింప జేయాలనీ... దానివల్ల పరిశ్రమ బాగుపడుతుందనీ" వున్న అంశం చర్చకి వచ్చింది. ఈ విషయాన్ని చేర్పించింది రామ్మోహనరావు.

"ఒకే" అన్నారు అందరూ. పోయేది తమ సొమ్ము కాదు కాబట్టి చైర్మన్ ఆ అంశం పూర్తయినట్టు టిక్కుపెట్టబోతూంటే గాంధీ నెమ్మదిగా 'ఇదంతా చిన్న విషయం కాదనుకుంటాను" అన్నాడు. అందరూ అతడివైపు చూశారు. రామ్మోహన రావుకూడా విస్మయంతో అతడివైపు చూసేడు. ఎందుకంటే చిల్లరఅమ్మకందార్లకి ఎక్కువ ఋణాలు ఇస్తే దానివల్ల తమందరికీ లాభం. అటువంటిదాన్ని గాంధీ ఎందుకు వ్యతిరేకిస్తున్నాడో అర్థంకాలేదు. గాంధీ గొంతు సవరించుకొని చెప్పటం మొదలుపెట్టాడు.

"మన ప్రధాని కోర్కెప్రకారం మనం పరిశ్రమలకి, ఉత్పత్తి పెంచటానికి ఎక్కువ దోహదం చేయాలి. అంతేకానీ చిల్లర వర్తకదార్లకి ఎక్కువ ఋణాలు ఇస్తే వాళ్ళు 'కాగితాన్ని' మరింతగా కొని దాస్తారు. అందువల్ల కాగితంధర మరింత పెరుగుతుంది. అది మన ప్రధానమంత్రి ఆశయానికే భంగం. ఒకవేళ పేపరు పరిశ్రమకే మనం ఈ రెండు కోట్లూ వెచ్చించదల్చుకుంటే దాన్ని చిల్లర దుకాణదార్లకి ఇవ్వటంకన్నా-ఇంకో పరిశ్రమ పెట్టటానికి ఇస్తే దానివల్ల ఉత్పత్తి పెరుగుతుంది కదా"

వెంటనే రామ్మోహనరావు కల్పించుకుని అన్నాడు- "అసలే కాగితం విపరీతంగా తయారవుతూంటే ఇంకో మిల్లు దేనికి? ఇంతకన్నా తెలివితక్కువ ప్రపోజల్ ఇంకొకటి వుండదు."

"కాగితం ఎక్కువ తయారవుతున్న విషయాన్ని ఒప్పుకుంటే మరిక చిల్లర




వర్తకులకు ఋణాలు దేనికి? ఎలాగూ ఉత్పత్తిదారులు అమ్మకందార్లకి క్రెడిట్ ఇస్తారుకదా!"

బోర్డు రూమ్‌లో సూది పడితే వినబడేటంత నిశ్శబ్దం వ్యాపించింది, తనని సరిగ్గా ఎక్కడ కొట్టాలో అక్కడే కొట్టాడు గాంధీ.

రామ్మోహనరావు అతడివైపు సూటిగా చూసాడు.

ఎవరితడు? ఒకప్పుడు పదిపైసలు లేక అల్లలాడిన వాడేనా? చిరిగిన కాలరుతో, ఆకు చెప్పుల్తోనూ తన ఎదురుగా నిలబడి పందెంకట్టిన వాడేనా? ఈ క్షణం తనతోపాటూ ఈ ఎయిర్ కండిషన్డ్ గదిలో సమాన స్థాయిలో కాలుమీద కాలు మీద కాలువేసుకుని కూర్చున్న ఇతడు-సరిగ్గా నాలుగున్నర సంవత్సరాల క్రితం ఒక బికారీ అనీ - నిరుద్యోగి అనీ ఎవరైనా చెబితే నమ్మగలరా? ఇందులో లాటరీ లేదు. అదృష్టంలేదు కేవలం ఇతడు-నటుడికైతే-అన్నట్టు పెరిగిపోయాడు వ్యవస్థ మారదు అని నిరాశపడే నిరుద్యోగులూ - మారాలి అని కేవలం గొంతు పగిలేలా అరిచే ఆవేశపరులూ ఇతడి జీవితాన్ని పరిశీలిస్తే ఎంత బావుణ్ణు.

క్షణంలో ఇన్ని ఆలోచనలు అతడిలో చోటుచేసుకున్నాయి. ఆ క్షణమే తను ఓడిపోతున్నానేమో అన్న భయం కూడా కలిగింది. అయితే అది క్షణకాలం మాత్రమే. వెంటనే పట్టుదల హెచ్చింది పూర్వపు రామ్మోహనరావు అయిపోయాడు. చుట్టూచూసాడు. బోర్డు డైరెక్టర్లందరూ తనవైపే చూస్తూవుండటం గమనించి గొంతు సర్దుకున్నాడు, "కాగితం ఉత్పత్తి పెరిగినమాట నిజమే కానీ బైటచూడండి. అసలు నోటు పుస్తకాలు దొరకటంలేదు. టెక్స్టు పుస్తకాలు ఆలస్యం అవుతున్నాయి. దీని

అంతటికీ కారణం చిల్లరదుకాణదార్ల దగ్గర తగినంత ఆర్థిక స్తోమతవల్లనే అప్పుడే రాష్ట్రంలో విద్యార్థులు స్ట్రయికులు మొదలుపెట్టారు. అల్లర్లు చెలరేగుతున్నాయి. ఒక జాతీయ సంస్థగా మన బ్యాంకుకి ఈ పరిస్థితిని ఎదుర్కొని రాష్ట్రప్రభుత్వానికి సాయంచెయ్యవలసిన నైతిక బాధ్యత వుంది. మనం కాగితం పరిశ్రమకి అప్పు ఇవ్వటంద్వారా అలాటి నైతిక బాధ్యత నెరవేర్చిన వాళ్ళం అవుతాం. రాష్ట్ర సంక్షోభం తొలగిపోతే ప్రధాని సంతోషిస్తారు. రెండుకోట్ల రూపాయల్ని చిన్నచిన్న దుకాణదార్లకు పంచటం ద్వారా మన దేశంలో బలహీన వర్గాలకు ఇంత ఎక్కువ ఋణం ఇచ్చిన ఖ్యాతికూడా మన బ్యాంకుకే దక్కుతుంది. ప్రధాని ఆశయంకూడా బలహీనవర్గాల సంక్షేమమే! మనం తీసుకోబోయే ఈ నిర్ణయంతో ఒకవైపు రాష్ట్ర సంక్షోభాన్ని నివారించటం-మరోవైపు బలహీన వర్గాలకు సాయంచేసేమన్న పేరు లభించటం, -ఈ రెండు లాభాలూ లభిస్తాయి. ఇలాటి అవకాశం నూటికో కోటికో ఒకటి వస్తుంది. వదులుకోవటం మన మూర్ఖత్వం. అంతకన్నా నేను చెప్పగలిగేది ఏమీలేదు".

బాలా నాటకీయంగా ముగిసిన అతడి ఉపన్యాసానికి బోర్డు మొత్తం మంత్ర ముగ్ధులైనట్టు మెంబర్ల భంగిమే చెబుతూంది. దాదాపు అందరూ ఏకగ్రీవంగా ఆ అంశాన్ని 'పాస్' చెయ్యటానికి వుద్యుక్తులయ్యారు. రామ్మోహనరావు బాలా తెలివిగా తన వుపన్యాసంలో 'బలహీన వర్గాలు', 'ప్రధాన మంత్రి', 'రాష్ట్రాన్ని సంక్షోభాన్నుంచి రక్షించటం' అన్న పదాలు చొప్పించటంద్వారా గవర్నమెంటు డైరెక్టర్లని ఆకట్టుకున్నాడు. మిగతా ముగ్గురు డైరెక్టర్లూ టాటావాలాతో సహా.... అతనివాళ్ళే.

గాంధీ ఈలోపులో బ్రీఫ్‌కేసులోంచి కాగితాలు తీసి బల్లమీద పరిచాడు. డైరెక్టర్లు వాటిని పరిశీలిస్తూ వుండగా చెప్పటం ప్రారంభించాడు

"ఇప్పుడు మీకిచ్చిన కాగితాల్లో మొత్తం రాష్ట్రంలో తయారయే పేపరు ఉత్పత్తి తాలూకు వివరాలున్నాయి. ఈరోజునాటికి గోడౌన్లలోనూ, హోల్‌సేలర్స్ దగ్గిరా వున్న స్టాకు వివరాలు కూడా వున్నాయి. వాటిని గమనిస్తే దాదాపు ఆర్నెల్ల ప్రొడక్టు గోడౌన్లలో వుండిపోయినట్టు తెలుస్తూంది. నేనూ ఒక పేపరుమిల్లు ఓనర్నే. ఇంత స్టాకు వుండిపోయింది కాబట్టి నేను ఒక యజమానిగా తీసుకునే నిర్ణయం ఏమిటంటే నా ఖాతాదార్లకి ఏవో ఒక టెర్మ్సు మీద పేపర్ని తోసెయ్యటం, ఇంత పేపరు ఉత్పత్తి జరుగుతున్నా పుస్తకాలు బజార్లలోకి రాకపోవటానికి కారణం ఏమిటి?"

అంటూ మరో కట్ట డైరెక్టర్ల ముందుకి తోశాడు. "ఇవి రాష్ట్రంలో వున్న పెద్ద ప్రెస్సుల వివరాలు, ఇవిగాక వున్న ప్రెస్సులు, సిలిండర్స్ వున్న ప్రెస్సుల వివరాలు ఇవి దీనిబట్టి అర్థమవుతూ వుందేమిటంటే పుస్తకాలు సకాలంలో రాక పోవటానికి కారణం కాగితం కొరత కాదు. ప్రెస్సుల కొరత. ప్రెస్సులకి తగిన




ఆర్థిక సహాయం అందకపోవటం! మనం ఇద్దామనుకున్న రెండుకోట్ల రూపాయలూ చిన్న చిన్న ప్రెస్సులకి ఇద్దాం. ఒక కాగితపు ఫాక్టరీ యజమానిగా ఇది నాకు నష్టమైనా-ప్రధానమంత్రి పవిత్ర ఆశయాల్ని నెరవేర్చటానికి కొంత నష్టమైనా నేను దీన్ని ప్రతిపాదిస్తున్నాను" అని "ప్రధానమంత్రి" అన్న మాటను నొక్కి పలుకుతూ "చిన్న ప్రెస్సులవాళ్లు రిటైలు కాగితందార్లకన్నా ఎక్కువ బలహీన వర్గాలు" అని ముగించాడు. తన వాదనలో లాజిక్ వుందని గాంధీకి తెలుసు. కానీ ఇక్కడ లాజిక్కులు పనిచెయ్యవు. ఒక విధంగా చూస్తే "ఎవరికెంత బలముందో చూసుకునే బలపరీక్షే ఇది!

రామ్మోహనరావు కుర్చీ వెనక్కి జారబడి అంతా నవ్వుతూ విన్నాడు. గాంధీకి తను వేసిన బాణం ఎంత దూరం వెళ్ళి ఎక్కడ గుచ్చుకుందో తెలీదు. కానీ ఒకరిద్దరు డైరెక్టర్లు తన వాదనని జాగ్రత్తగా వినటం గమనించాడు.

ఇద్దరి వాదనలూ అయ్యాక, చైర్మన్ ఈ అంశాన్ని ఓటింగ్ పెట్టాడు. డిపాజిట్టు హోల్డర్ల తాలూకు డైరెక్టర్ "పేపరు దుకాణదార్లకు అప్పు ఇవ్వటం ద్వారా మనం మంచి నిర్ణయం తీసుకుంటాం - అని నేను భావిస్తాను" అన్నాడు. అంటే అతడి ఓటు రామ్మోహనరావుకి పడ్డదన్నమాట.

రెండో డైరెక్టరుకు రిజర్వ్ బ్యాంకు తాలూకు ప్రకాష్ మెహ్రా. ఇతడు తెలివైనవాడు. ఇతడికి గాంధీ లాజిక్ నచ్చింది. అదీగాక పేపరువాళ్ళకి అప్పు ఇవ్వటం ద్వారా ఇన్‌డైరెక్టుగా రామ్మోహనరావు తనకి తాను సహాయం చేసుకుంటున్నాడన్నది అందరికీ తెలిసిన సత్యమే.

అతడు గాంధీ వైపు ఓటు వేసేడు.

మూడో డైరెక్టరు బలహీన వర్గాల తరపున నియమింపబడ్డ డైరెక్టర్. కానీ ఇతడికి నాలుగు ఫాక్టరీలూ అయిదు కార్లు వున్నాయి. రామ్మోహనరావుతో సన్నిహిత సంబంధాలు వున్నాయి. అందుకని అటు వేసాడు

నాలుగో డైరెక్టర్ శ్యామ్ ప్రభుత్వం తరపున నియమింపబడ్డ డైరెక్టర్. అందుకని సహజంగా ఇతడికేమీతెలీదు రామ్మోహనరావుకన్నా గాంధీ ఉపన్యాసం ఇంగ్లీషులో బావుంది కాబట్టి, ప్రకష్మెహ్రకూడా అతడికే వోటు వేసాడు కాబట్టి తనూ అటే ఓటు వేసాడు. అప్పటికి చెరో వైపూ రెండు ఓట్లు పడ్డాయి. అయిదో డైరెక్టర్ రామ్మోహనరావు తలూకు మనిషి అతడి జేబులో వున్నవాడు. కాబట్టి అటు వేసాడు.

రామ్మోహనరావుకి మూడు-గాంధీకి రెండు.

ఇక మిగిలింది ఛైర్మన్ - టాటావాలాలు ఇద్దరే.

టాటావాలా తన నిర్ణయం గురించి చెప్పబోతూవుంటే బైట్నుంచి ప్యూన్‌వచ్చి ఛైర్మన్‌కి చీటీ అందించాడు.

ఛైర్మన్ ఆ చీటీ చదివి "టాటా సాబ్! మీకు టెలెఫోనింగ్ కాల్. ఢిల్లీనుంచి" అన్నాడు. టాటావాలా లేచి హడావుడిగా బైటకి వెళ్ళాడు. అయితే అతను వూహించని విధంగా అక్కడ ఫోన్ లేదు. లక్ష్మి వుంది.

ం ం ం ం

బోర్డు రూమ్ నిశ్శబ్దంగా వుంది.

రామ్మోహనరావుకి కొద్దిగా టెన్షన్‌గా వుంది. ఇది గోటితో పోయే వ్యవహారం అనుకున్నాడు కానీ అప్పుడే రెండు ఓట్లు గాంధీకి పడ్డాయి. దాంతో కొద్దిగా బెదిరాడు. అయినా అది లిప్తపాటు మాత్రమే. గవర్నమెంటు తరపువాళ్ళు తన వైపు వేయకపోయినా, తనకి మెజారిటీ వుంది. టాటావాలా, ఛైర్మన్‌లతో కలుపుకొని తాము ఆరుగురు, వాళ్ళు ముగ్గురూ అవుతారు ఈసారి ఢిల్లీ వెళ్ళినప్పుడు గవర్నమెంటు డైరెక్టర్ని "పెర్సనల్"గా కలుసుకోవాలి. నిజానికి ఈ విషయం ఈ మొదటి మీటింగ్‌లో తేలిపోవటమే మంచిది. గాంధీని మరి లేవకుండా నడుము విరగ్గొట్టి తన శక్తి చూపించవచ్చు. గాంధీ ఈ మీటింగ్‌కి పేపర్లూ అవీ లెక్కల్తో సహా తీసుకొచ్చేడంటే ఈ మీటింగ్‌లోనే అమీతుమీ తేల్చేసుకోవాలనుకున్నాడన్న మాట....తేల్చుకోనీ!

అదే సమయానికి, గెడ్డంక్రింద రెండు చేతులూ పెట్టుకొని, కళ్ళు మూసుకుని గాంధీ ఆలోచిస్తున్నాడు. అతడు ఆలోచిస్తున్నది తన గెలుపుగురించి కాదు. నిశ్చ

యంగా తను ఓడిపోతానని అతడికి తెలుసు.

ఇంత సీరియస్‌గా దేశక్షేమంకోసం, ప్రజల సంక్షేమంకోసం వాదించినట్టు కనబడే తమ వుపన్యాసాల వెనక నిజంగా అటువంటి కోర్కె ఏమీలేదు. బ్యాంకు అప్పుని పేదవాళ్ళకి ఇచ్చినందువల్ల తనకి పోయేదేమీ లేదు. ప్రెస్సువాళ్ళకి ఇచ్చినందువల్ల రామ్మోహనరావుకి తరిగేదేమీ లేదు పైకిమాత్రం ఇద్దరూ ప్రజల మనుష్యుల్లా గొంతు అర్చుకుపోయేలా వాదిస్తున్నారు. తమ స్వప్రయోజనంకోసం (అది కూడా పెద్ద ప్రయోజనమేమీ కాదు. 'ఎవరు గెలుస్తారా' అన్న మాట పట్టింపు) దెబ్బలాడుకుని తాము తీసుకోబోయే ఈ నిర్ణయం బైట ఎన్నో కుటుంబాల భవిష్యత్తుని శాసిస్తుంది. ఎందరో ప్రెస్సులవాళ్ళని లక్షాధికారల్ని చేస్తుంది. కాగితం అమ్మేవాళ్ళని ఎందర్నో వీధిన పడేస్తుంది. తమ లెవల్లోనే ఇలా వుంటే ఇక అసెంబ్లీల్లోనూ పార్లమెంటులోనూ వ్యక్తిగత, పార్టీ పక్ష నిర్ణయాలు ఎలా వుంటాయి? ఎవరి ప్రయోజనంకోసం తామందరూ ఈ బోర్డు డైరెక్టర్లుగా అసెంబ్లి మెంబర్లుగా పార్లమెంటేరియన్లుగా పనిచేస్తున్నారు?....తను వేదాంతి అవుతున్నాడా.....నో ,నో... అనలా భావమే రానీయకూడదు.



"నేను ఇంతవరకూ మిమ్మల్ని ఏమీ కోరలేదు టాటాసాబ్. ఈ ఒక్కటీ చెయ్యండి" అంది లక్ష్మి.

దాదాపు అయిదు నిముషాలుగా వాళ్ళిద్దరి మధ్య సంభాషణ జరుగుతూంది. టాటావాలా ఆలోచిస్తున్నాడు. ఈక్షణం తను తీసుకోబోయే నిర్ణయం తనజీవితంలో గొప్ప మార్పు తెస్తుందని తెలుసు. శాశ్వతంగా రామ్మోహనరావునించి విడివడటమే!

అయినా రామ్మోహనరావు తనకేం చేశాడు.

టాటావాలాకి వరసగా సంఘటనలు జ్ఞాపకం వచ్చాయి.

తమచేత టి. ఎఫ్. టి. కంపెనీ స్థాపించటం-దాంట్లో నష్టం-షేర్లు కొనవద్దనటం-అందులో నష్టం-వరుసగా అన్నీ నష్టాలే! ఈ రామ్మోహనరావు చేసిన ప్రతీ పనీ తన స్వార్థంకోసమే....

కానీ లక్ష్మి అలాకాదు. తనని నమ్మింది. అన్నీ తనకి చెప్పింది. ఈమెగాంధీ తాలూకు మనిషి అయితే అటు వుండొచ్చుగాక! ఆమాటకొస్తే తనకి రామ్మోహనరావు ఎంతో గాంధీ అంతే!




రాజకీయాల్లోనూ, బిజినెస్సులోనూ స్నేహాలూ బంధుత్వాలూ ఏమిటి?

లక్ష్మి అతడి చేతిమీద చెయ్యివేసి "ప్లీజ్" అంది. కరుగుతున్న మంచు పూర్తిగా కరిగిపోయింది.

బోర్డురూమ్‌లోకి వచ్చి టాటావాలా గాంధీవైపు ఓటు చెయ్యగానే చైర్మన్ కొద్దిగా కంగారు పడ్డాడు. ఇప్పుడు తను ఎటు వస్తే అటు తీర్మానం నెగ్గుతుంది. అటు వున్నది-గవర్నమెంట్, రిజర్వు బ్యాంకు డైరెక్టర్లు. వాళ్ళకి వ్యతిరేకంగా ఎందుకు చెప్పటం-

తనూ గాంధీ ప్రతిపాదనని సపోర్టు చేసాడు. నాలుగూ మూడు తేడాతో రామ్మోహనరావు ఓడిపోయాడు.

# 26

శివకైలాష్ బ్యాంకులో రామ్మోహనరావు తీర్మానం ఓడిపోవటం-ఆ చరిత్రలోనే పెద్ద సంచలనం.

దీనికి రామ్మోహనరావు రియాక్షన్ ఎలావున్నా గాంధీమాత్రం ఆశ్చర్యంతో తలమునకలవుతూ టాటావాలా వైపు చూసాడు.

బ్యాంకు మీటింగ్ పూర్తయ్యాక బైటకొస్తే లక్ష్మి కనబడింది. అతడు మరింత ఆశ్చర్యంతో "నువ్వెలా వచ్చావ్ ఇక్కడికి" అని అడిగాడు.

"అంజిరెడ్డిగారు-నువ్వు అర్జెంట్‌గా రమ్మన్నావని పిల్చారు. ప్రొద్దున్న కార్లో వచ్చాను" అంది.

అతడికి అంజిరెడ్డి ప్లాను అర్థమై "హాట్సాఫ్ అంజిరెడ్డి" అనుకున్నాడు. ఈ సంఘటన ప్రభావం ఇక్కడితో ఆగిపోలేదు.

"పేపర్" అని ఒక చిన్న పత్రిక వస్తుంది. కేవలం పేపర్ ఉత్పత్తిదారులకే పరిమితమైన పత్రిక అది. "పౌల్ట్రీ" అన్న పత్రిక కోళ్ళ పెంపకందార్లకి పరిమితం అయినట్టు. ఆ పత్రిక పెద్ద అక్షరాల్తో "రామ్మోహన్‌రావుపై అంజిరెడ్డి విజయం" అన్న వార్త ప్రచురించింది ఆ వార్త అన్ని వర్గాల్లో దావానలంలా వ్యాపించింది

అంజిరెడ్డి గాంధీకి ఫోన్‌చేసి "థాంక్యూ అండ్ కంగ్రాట్స్" అన్నాడు. "ఈ దెబ్బతో రామ్మోహనరావు అణగారిపోతాడు. నీ కసి తీర్చుకున్నట్టే"

"థ్యాంక్స్ నాకు మీరిచ్చిన మూడు లక్షల్లో ఒక గ్రాండ్ జమచేసుకోండి'' అన్నాడు

"పంపిస్తున్నావా"

"లేదు. బ్యాంకు డైరెక్టర్‌గా వుండి నేను మీకు చేసిన సాయానికి"

"సాయం ఏమిటి''

''కాగితం చిల్లర దుకాణవార్లకి అప్పు వెళ్ళకుండా వుండటం మీకు లాభమే కదా! అది చేసినందుకు ఫీజు లక్ష! ఇలా చిన్న చిన్న మొత్తాల్లో సంపాదించలేకపోతే ఎప్పటికి నా మూడులక్షల అప్పు తీరేను!" అని ఫోన్ పెట్టేసేడు.

○ ○ ○ ○ ○ ○ ○

ఆరోజు రాత్రి ఎనిమిది అవుతూవుండగా ఒక చిత్రం జరిగింది.

తలుపుచప్పుడయితే వెళ్ళి గాంధీ తలుపుతీసాడు.

ఎదురుగా రామ్మోహనరావు నిల్చుని వున్నాడు నవ్వుతూ.

గాంధీ అప్రయత్నంగా అడుగు వెనక్కి వేసాడు (సశేషం)

# హాండీకాప్

- మధుచక్రవర్తి -

ఈ కాలం కుర్రకారు మరీ బరితెగించి ప్రవర్తిస్తున్నారు. బస్సెక్కిన దగ్గర్నుంచీ చూస్తున్నాను వాళ్ళిద్దర్నీ. అది బస్సనీ, దీంట్లో యింకా ప్రయాణికులు ఉన్నారన్న స్పృహే లేకుండా ఒకటే వక వకలూ. సృష్టిలోని ఆనందమంతా తమదేఅన్నట్టుగా—లోకమంతా తామిద్దరమే అన్నట్టుగా.

ముందు గేటు పక్కగా కూర్చున్నారు.

కొత్తగా పెళ్ళయిందన్నట్టుగా, ఆ అమ్మాయి మెడ వెనుకగా పసుపుతాడు ముడి కనిపిస్తోంది. బహుశా వాళ్ళు సింహాచలంలో బస్సెక్కి ఉండాలి. నేను గోపాల పట్నంలో ఎక్కినప్పటి నుంచీ చూస్తున్నాను—ఒకరి మీద ఒకరు ఒరిగిపోవటం, ఒకరిని ఒకరు కొరుక్కోవటం.

నిజం చెప్పొద్దూ-ఆ అమ్మాయి చాలా బాగుంది. దాంపత్య జీవితపు తొలిదియ్యదనాన్ని-సుఖాన్ని అనుభవిస్తున్న తృప్తి ఆమె కళ్ళలో....బుగ్గల్లో కొట్టొచ్చినట్టు కనబడుతోంది, మరి అతనూ?....ఒత్తయిన ఉంగరాల జుట్టుతో....సిటారైన ముక్కుతో,...పచ్చని మేని ఛాయతో... అందగాడే!

ఎంత అందంగా ఉంటే మాత్రం.... ఎంత దంపతులైతే మాత్రం...యిలా పది మందిలోనూ, మరీ యింత యిదిగా ఛ... ఛ.ఛ.ఛ..మన సాంప్రదాయం- కట్టుబాటు మరచి.. ఇంత చౌకబారుగా.. నాకు ఒళ్లుమండి పోతోంది. అయినావాళ్ళ కోసం అనవసరంగా నా "మూడ్" పాడు చేసుకోవటం నా కిష్టంలేదు. అందుకనే ఈరోజు సాయంత్రం నా కార్యక్రమం వేపు నా ఆలోచనన్ను మళ్ళించాను. ఈ సాయంత్రం స్థానిక సెంట్రల్ లైబ్రేరీలో ఏర్పాటు చేసిన సాహిత్య సభలోనన్ను వక్తగా ఆహ్వానించారు. ఇలా సాహిత్య సభల్లో ఉపన్యసించడం పదేళ్ళుగా నాకు పరిపాటై పోయింది. సభలో మాట్లాడవలసిన అంశాలను మనసులోనే మననం చేసుకుంటున్నాను.

గత యిరవై యేళ్ళుగా రచనలు చేస్తున్నాను. సాహిత్యంతో పరిచయమున్న వారందరిలో నేనో ప్రముఖ సాహితీవేత్త

# స్నేహబిందువు

ఒక్క బీజంలో అగణిత వన
వితానాలు
ఒక్క బిందువులో అగణిత
వనధి గానాలు
దేశ-ధర్మ-జాతి-వర్గ వంతెనలు దాటి
ఒకే విరాట హృదయంలో
(విరాజితాలు) ప్రకంపితాలు
రూపగంధ భేదమున్నా కూడ
మన్ను మలినం కాదు
కోటిదీపకాంతులై వెలుగుతుంది
ఒక్క స్నేహబిందు

**విద్యారణ్య కామ్లేకర్**

నన్న గుర్తింపు ఉంది. మంచి రచయిత నన్న పేరుంది

బస్సు పోర్టు ఏరియాలోంచి పోతోంది.

నా ఆలోచనల్లోంచి తేరుకుని వాళ్ళ వైపు చూసాను.

మామూలే - ఇంకా వాళ్ళలో :ంలోనే విహస్తున్నారు వాళ్ళది ఈ ప్రాంతం కాదేమో-కనుచూపు మేర పరచుకున్న కన్వేయర్ బెల్టుపు-గుట్టగుట్టలుగా పోగులు పోసిన గంధకపు పొడిని-దూరంగా హార్బరులో లంగరు వేస్తున్న షిప్పుల్ని-ఎత్తయిన క్రేన్స్‌నీ యారాడ కొండమీది లైటు హౌస్‌ని చేత్తో గొప్పగా చూపిస్తూ-కాబూల్లో ఉన్న మనిషితో, కేబుల్లో మాట్లాడుతున్నట్టు, ఆరున్నొక్క శృతిలో ఆంజనేయరాజులా అతగాడు అరుస్తూ, అభినయించి చెబుతుంటే-ఆమెగారు మహా ఆశ్చర్యపడిపోతూ, చక్రాల్లాంటి కళ్ళను పరిత విశాలంగా చేసి చూస్తూ వింటోంది. నాకు ఉన్న పళంగా లేచి వెళ్ళి అతగాడి నోరు మూయించాలని పించింది.

"బొత్తిగా సంస్కారం..సివిక్ సెన్స్ లేని క్రీచర్స్.."నాలో నేనే గొణుక్కున్నాను. ఎందుకో మొదట్నించీ ఆ జంట పట్ల నాకు సదభిప్రాయం కలగ లేదు వాళ్ళ చేష్టలు చిరాకనిపిస్తున్నా - అటు వేపు చూడకూడదనుకుంటూనే చూస్తున్నాను.

బస్సు పోర్టు బస్టాప్‌లో ఆగింది.

అతను లేచాడు. లేపాక్షి లాల్చీలో బెంగాలీ బాబులా ఉన్నాడు. ఆవిడగారు విక్టోరియ మహారాణిలా అతి నెమ్మదిగా-ధీమాగా_దర్జాగా లేచి తనను వదిలి ఎక్కడికో పారి పోతాడని కాబోలు తామర తూడులాంటి తన చేతిని, అతగాడి నడుము చుట్టూ పోనిచ్చి నుతి మెత్తంగా పట్టుకుంది. మరీ అతగాడు తక్కువ తిన్నాడా!....తన బలమైన ఎడమ చేతిని ఆమెగారి నడుం చుట్టూ వేసి మరి తదగ్గరకు హత్తుకుంటున్నాడు..

అబ్బబ్బ ..ఆవికారపు చేష్టలకి నాకు వాంతి వచ్చేట్టుగా ఉంది. చూళ్ళేక తల దించుకున్నాను

సుత్రంగా ఇంటికెళ్లాక వాత్స్యాయనుడి భంగిమలన్నీ ఒకటికి పదిసార్లు ప్రాక్టీసు చేసుకోమను. నేను కాదన్ను కానీ-పదిమందిలో... ఇదేమిటి... పెద్ద అమర ప్రేమికుల్లా... బస్సు కదలగానే తలెత్తి కిటికీలోంచి పక్కకి చూసాను. వాళ్ళిద్దరూ రోడు దాటుతున్నారు.

అప్పుడు చూసాను-ఆమెను పూర్తిగా.

ఆమె పాదాల లేత తమలపాకుల్లా లేవు.

ఎండిపోయిన ఆకుల్లా, పోలియోవాత పడి ముడుచుకుపోయాయి కాళ్ళు వికృతంగా వంకర తిరుగున్నాయి.

అతను....ఆమె నడుంచుట్టూ చేయి వేసి, పొదివిపట్టుకుని, జాగ్రత్తగా రోడ్డును దాటిస్తున్నాడు.

వెళ్తుంటే.... పెళ్ళినాటినుండీ— పదిహేనేళ్ళ నుండీ— వంటింటికీ— పడకటింటికీ పరిమితమైపోయి ఎలాంటి షికార్లు-సరదాలు—కనీసం సినిమాలు ఎరుగక, ఎప్పుడూ ఉబ్బసంతో దగ్గుతూ, జీవిత ఖైదీలా ఇంట్లోనే మగ్గుతూ- - నన్ను ఎప్పుడూ ఏమీ కోరి ఎరుగని నా భార్య సీత గుర్తుకొచ్చింది....

ఆర్ద్రతతో నా కళ్ళు చెమ్మగిల్లాయి.



నేను షాక్ తిన్నాను!

ఆ అభాగ్యురాల్ని జీవితభాగస్వామిగా స్వీకరించిన అతని హృదయం ఆకాశమంత విశాలంగా - అతని వ్యక్తిత్వం మేరుపర్వతమంత ఎత్తుగా అనిపించాయ్ నాకు.

తన భార్య అవిటిదైనా-పదిమందిలో ధైర్యంగా - హుందాగా నీకు తోడు నేనంటూ అతనలా ఆమెను నడిపించుకు

అవిటిదాన్ని అర్ధాంగిని చేసుకున్న అతని ఆదర్శం....మానసికంగా నాలోని అవిటితనాన్ని బట్టబయలు చేసింది. నా నలభై యేళ్ళ జీవితం.... అనుభవం.... ఆలోచన...అవగాహన....అన్నీ ఒక్కసారిగా అవిటివై పోయాయనిపించాయి. సిగ్గుతో నా ఒళ్ళు చచ్చిపోయింది.

బస్సుమాత్రం తనకేమీ పట్టనట్టు ముందుకు పోతూనే ఉంది. 

# రామ బాణం

1981-82 లో సారా దుకాణాల వేలంపాటలో



మన రాష్ట్ర ఎక్సైజు శాఖ వారికి 1,27,34,318 రూ॥లు రాబడి లభించింది!!



ఈ మధ్య 1982-83 కు సంబంధించిన వేలం పాటు లో 16,35,86,628 రూ॥లు రాబడి వచ్చింది!



అంటే కిందటేడు కన్నా ఈ ఏడు మనకి అదనంగా 14,08,52,310 రూ॥లు లాభం వచ్చిందన్నమాట!




పైగా సందు సందుకూ
గాంది గాందికీ సారా
దుకాణాలు వెలిశాయి!!
ఎక్కడజూసినా అవే!!


సారాయికోసం మనం
ఎక్కువ దూరం నడవక్క
ర్లేదు! మన రాష్ట్ర
ప్రభుత్వం ప్రజలకు చేసిన
ఎన్నో సదుపాయాల్లో
ఇదొక్కటి!!
నీరుమాలు
ఇలా యివ్వు!


ఎందుకూ?
ఇప్పుడే చెబుతా!!





# స్మృతి మంటలో..

సర్వ చరాచర సృష్టి రహస్యానికి అద్వైత సంకేతమై నిలిచిన స్మశాన వాటికలో....

సత్తువను కూడ గట్టుకుంటూ చితిని సమీపించిన తేజోమూర్తి ఆఖరిసారిగా అవంతి మొహంలోకి చూసాడు.

సజీవస్మృతులకు నిర్జీవ రూపంలా- నిర్వికల్ప సమాధిలో అఖండ సచ్చి దావం దాన్ని వెదుక్కుంటున్నట్టుగా అవంతి....

# జ్యోతి-భాగ్యలక్ష్మి లాటరీ కథల పోటీల్లో కన్సొలేషన్ బహుమతి పొందిన కథ

మనను కక్కిన రక్తపు ధారల్లా క్రాంతిగా అశ్రువులు బయటకు చిమ్మాయి....

వణకుతున్న చేతులతో చితికి నిప్పంటించాడు.

శృతి చేసిన జీవనరాగంలో అనుకోని అపశ్రుతిలా ఉవెత్తున పైకి లేచిన మంటలు....

భూభ్రమణం కలిగించే భ్రమ తప్ప ఉదయాస్తమయాలు వేరు కావని నిర్వచించే బ్రహ్మజ్ఞానిలా వశ్చిమాన అరుణ రాగంతో అద్దం పడుతున్న సూర్యుడు...

శిథిలమైన రమ్య దాంపత్య హర్మ్యపు శకలంలా అగ్నికి ఆహుతై పోతున్న అవంతి....

"అవంతీ..రాయటం ఆపా సావేం.."

"చేతులు నొప్పెడుతున్నాయిండీ...."

"పోనీ....స్లోగా డిక్టేట్ చెయ్యనా.."

"ఇవాల్టికి చాలండీ...."

"రేపే కథని పోస్ట్ చెయ్యాలి... మంచి దానివి కదూ...."

"ఏమో బాబూ....నాకైతే అలసటగా వుంది...."

"సరేలే....నిద్రపో...."

"కోపమొచ్చిందా...."

"ఊహు...."

"మరి మీరు నిద్రపోరూ...."

"ఊహు...."

"మరి...."

"ఇలాగే....నిన్ను చూస్తూ తెల్లవార్లూ గడిపేస్తాను"

"ఆశ...."

"అబ్బా........లైటార్పండీ....ఆర్పమంటుంటే...."

"పిచ్చేదంటుంటే...."

"ఎందుకని...."

"ఆర్పితే....నువ్వు కనపడవుగా...."

"వినపడతాగా...."

"నువ్వు కనపడుతూ వినపడాలి...."

"ఎంతకాలం...."

"ఎల్లకాలం...."

"ఒకవేళ....యీ క్షణంలో....ఇలాగే మీ ఒడిలో....రాలిపోతే...."

"అవంతీ...."

రాకాసి కేకలా తీతువు అరుపు.....

రివ్వున వీచిన గాలికి చితిమంటలు చిరుగుటాకుల్లా కదులుతున్నాయి....

మలిగిపోతున్న నక్షత్ర గుణంలా ముసురుకుంటున్న మసక చీకటి....

నిరాసక్తంగా సిగరెట్ వెలిగించాడు.

గుండెల్లోని వల్కా నో అశ్రువుల్ని ఆవిరిచేస్తుంటే....

కొమ్మనాపల్లి గణపతిరావు

అలలుగా కదలి అదృశ్యమైపోతున్న దాంపత్య జీవనస్మృతి....

పాలపుంత ఉల్కాగామారి నేలరాలిన విషాదకృతి....

చప్పట్లు....

ప్రకృతిలోని ప్రశాంతతని ప్రళయ ప్రభంజనమై హరించే సమ్మెటపోట్లు....

"తేజోమూర్తి....అందుకో అభాగ్య స్త్రీల కన్నీటి హారతి...."

"స్త్రీజాతిజీవన తిమిరాన చిరుదివ్వెను వెలిగించిన అఖండజ్యోతి రచయితగా నలుదిసెలా నూరేళ్ల వ్యాపించాలి నీ ఖ్యాతి"

"ఎ లైట్ టు లిట్ ది లైటాఫ్ లైట్...."

చురుక్కుమన్న స్వగతం....

సిగరెట్ నేలపై నుసిగా రాలింది....

గుండెల్లో కరాళ నృత్యం....

"ఏమండీ...."

"అ....వం....తీ....ఎందుకాకన్నీళ్లు ఏం జరిగింది...."

"................"

"మాటాడు అవంతీ....ఏమైంది?"

"ఏమండీ ...పతనమైన స్త్రీలంటే మీ కెందుకకంత జాలి...."

"గుండెలార్చే గతం తప్ప సేదదీర్చే వర్తమానాలకి నోచుకోని అభాగినులు కాబట్టి...."

"వాళ్ళ జీవితాలు అలాగే కడతేరి పోవాలా...."

"లేదు అవంతీ....మోడువారిన వారి బ్రతుకులు మళ్ళీ మొలకెత్తాలని కోరుకునే మొదటి వ్యక్తిని.... అటువంటి ఆదర్శా నికే కట్టుబడిన రచయితన్నేను...."

"....... ........"

"................"

"ఏమండీ....నన్ను క్షమించరూ..."

"క్షమించాల్సిన పొరపాటు ఏంచేసా వని?...."

"చేసానండీ... ... మీకు ఘోరమైన అన్యాయం చేసాను"

"అవంతీ .. "

"అవునండీ....నూరేళ్లు మీ నీడలో బ్రతకాల్సిన నేను యీ నిప్పుల కొండను నా గుండెలో దాచుకోలేను....అనుక్షణం మిమ్మల్ని మోసంచేస్తూ...."

"అవంతీ... "

"నేను....నేను...."

"............"

"నేను....ఓ మోసపోయిన ఆడదా న్నండీ....పెళ్ళికి ముందే ఓ బిడ్డకుతల్లి నైన...."

"అవంతీ...."

............

"అ ...వం ...తీ...."

............

"ఇట్సాల్ రైట్.... ఆనెస్ట్ ఎర్రర్ ఈజ్ టు బి ఫీల్డ్ నాట్ రిడిక్యుల్డ్...."

ఫెటేల్ మంటూ కపాలం పగిలిన చప్పుడు....

పొగచూరిన ప్రకృతిలో ఆకలితీరిన, ప్రేతాలా నివురును కప్పుకుంటున్న నిప్పులు....

మేఘావృతమైన ఆకాశం శోకాన్ని ఆపుకోలేక విలవిలలాడింది ప్రేతాత్మల కోరస్‌తో గాలిహోరు....

కాళ్ళక్రింద దొర్లుతూన్న కపాలాలను తప్పించుకుంటూ తన్నుకుంటూ....



## రచయిత పరిచయం

ఉద్యోగం హైద్రాబాద్ హెచ్ఎమ్టిలో ఫౌండ్రీ ఫోర్‌మెన్‌గా. రాయటం మొదలు పెట్టింది ఎప్పుడైనా ఇంత వరకూ ఆంధ్రప్రభ, ఆంధ్రభూమి, జ్యోతిపత్రికల్లో ఓ ముప్పై దాకా కథలు పడ్డాయి.

ఇదే మాసపత్రికలో 'హర్షబాష్పం' 'అస్తమించని సూర్యుడు' అనుబంధ నవలలతో పాటు ఆమధ్య ఆంధ్రప్రభ వారపత్రికలో 'పడిలేచే కడలి తరంగం' నవల కూడా సీరియల్‌గా ప్రచురించబడింది. అన్నట్టు నాకు ఆది నుంచీ నాటకాల కూడా రాయటం అలవాటు-'కేటు-డూప్లికేట్' కాస్త పేరు తెచ్చింది కూడాను.

అప్రయత్నంగా పెరిగిన గెడ్డంతో ఎలా వుంటానో చూసుకునే అవకాశాన్నిచ్చిన జ్యోతికి కృతజ్ఞతలు.

సత్తాగల రచన ద్వారా మంచిరచయిత అనిపించుకోవడం మంచిదనిపించే నాకు ఒకసారి మంచి రచయితగా గుర్తింపు పొందిన వాడు రాసే ప్రతిదీ మంచి రచన అంటే అంగీకరించ బుద్ధి కాదు..

అభిమాన రచయితలు చాలామంది వున్నారుకాని నాలాంటి యువ రచయితలకు మార్గ దర్శకుడు-ఏం రాసినా ఎంత బాగా రాసాడు, అనిపించుకుంటున్న మిత్రులు యండమూరి వీరేంద్రనాథ్‌గారు అంటే అందరికన్నా అమిత గౌరవం మరి....

కొమ్మనాపల్లి గణపతిరావు

తులుతూ బూడిదగా మారినా ఆవంతిని సమీపించాడు.

గాలి గుసగుసలు....

"నాచావుకెవరూ బాధ్యులు కారు.... దేవుడిలాంటి భర్తను దగాచేసి ధైర్యంగా బ్రతికే శక్తి లేక ఇలానన్ను నేను అంతం చేసుకుంటున్నాను....అవంతి...."

"అ....వం....తీ" కేన్సర్ గొంతులా పూడుకు పోయిన కంఠం.... అణువణువునా ఉద్విగ్నత....

నిస్త్రాణగా జారిన కన్నీళ్లు నిప్పులపై పడి అర్థం కాని భాషలో కనురుకుంటున్నాయి....

"మిస్టర్ తేజోమూర్తి....పోస్ట్ మార్టమ్‌లో విషం పుచ్చుకుని ఆత్మహత్య చేసుకున్నట్టుగా నిర్ధారణయ్యింది.... ఎంక్వయిరీలో ఉత్తరంలోని దస్తూరీ మీశ్రీమతిదేనని కూడా రూఢి అయ్యింది.

# అబ్బబ్బ! మావాడి తపన చూడడం నాతరం కాదు బాబూ ఎంతగా అల్లలాడి పోతాడో పాపం.
# చూశారా, స్కూల్నించి వస్తూ శుబ్బరంగా తడిశాడు... ఈ పాపిష్ఠి జలుబు తెచ్చుకున్నాడు.



పోయినసారి వాడు తడిసొచ్చినప్పుడు భయంతో నాకు వణుకు పుట్టింది. ఆ తుమ్ములూ, ఆ ముక్కు కారడం. అబ్బ! ఒక వళ్ళంతా నొప్పులని అన్నాడు. నేనేమో వెంటనే వాడి వొళ్ళు తుడిచి పక్క మీద పడుకో బెట్టాను. ఆపైన విక్స్ వేపోరబ్ వాడి ముక్కుపైనా, గొంతుపైనా, ఛాతీ పైనా, ఇంకా వీపుపైన కూడా బాగా రాశాను. విక్స్ చలవే అనాలి... నా బాబు రాత్రంతా చక్కగా నిద్రపోయాడు. తెల్లారగానే హుషారుగా స్కూలుకు వెళ్ళడానికి తయారయాడు. ఏమిటి, వాడి జలుబా! అదిగో... హుష్ కాకీ!

ఇంక నాకేం దిగుల్లేదమ్మ! ఎప్పుడూ పనిచేసే విక్స్ వేపోరబ్ సీసా తయారుగా దగ్గరుంచుకుంటా, నా బాబు హుషారుగా ఉంటాడని తెలిసి తృప్తిగా ఉంటా!

## విక్స్ ఇచ్చే అభయం
## మీ ఆప్యాయతకు సమానం

విక్స్ వేపోరబ్ జలుబు లక్షణాల్ని త్వరగా తగ్గిస్తుంది. ఎందుకంటే దానిలో రెండు విధాల పనిచేసే శాస్త్రీయ సూత్రం ఉంది. దాని ఔషధ యుక్త ఆవిర్లు మీ శ్వాసనాళాల్ని తెరిచి హాయిగా గాలి పీల్చుకోనిస్తాయి. ఇక దాన్ని చర్మంపై రాసినప్పుడు ఒళ్ళు నొప్పులు ఉపశమిస్తాయి. అందుకే, అది కుటుంబానికంతటికీ అతి విశ్వసనీయమైన జలుబు మందయింది.




**విక్స్ వేపోరబ్**

RHL-20 TEL

యూ కెన్ కలెక్ట్ ది బాడీ...."

ఘోష....గొంతు పిడచ కట్టుకు పోతున్నట్లుగా గుండెల్లో గునపాలుగుచ్చుతున్నట్టుగా... భవం.... అనుభవం ....

చీకటి ...మనను పైరోకటి పోటులా.

తరుముతున్నగా పైకి లేచి పరుగు లాంటి నడకతో ముందుకు నడిచాడు ...

ట్రాన్స్‌లోకి జారిపోతున్నట్టుగా ఉంది.

దినైట్ కిస్సెస్ ఫేడింగ్ దే విస్పరింగ్ టు హిజ్ యియర్....ఐ యామ్ డెత్....యుర్ మదర్ .. ఐయామ్ టు గివ్‌యూ ఫ్రెష్ బర్త్...."

వర్షం.... ఉరుములు.... పరుగు.... అవంతికి దూరంగా... దూరంగా వున్న స్మశానానికి దూరంగా....

ఏవో వికృత పరిహాసాలు....

అవహేళనలు....

సూదుల్లా శరీరాన్ని మోదుతున్న జల్లు....

ఇంటిలోనికి అడుగు పెట్టాడు.

చీకటి....చిక్కని పావంలా.

అవంతి పారాడిన దేవాలయం.

ఆదర్శనిలయం.... నవ్వులు........ ఎవరది....

బయట పెనుగాలి....అంతరంగంలో కల్లోల సాగర మథనం....

కిటికీ రెక్కల విలయ విన్యాసం....

"పూర్తిగా తడిసిపోయావు....జలుబు చేయదూ...."....ఎవరది....

లలిత మృదుకలిత విస్వంభరవిశ్రుత ప్రణవనాదం....

ఆమని సౌదామని సౌహార్దనుమధుర ప్రణయగానం....

చీకట్లను చీల్చుతూ విద్యుద్దీపం.... ఆల్బమ్‌లోని అవంతి నవ్వుతోంది.. కవ్విస్తున్నట్టుగా ప్రవర్తిస్తోంది. గోడలకు వేలాడుతున్న నవ్మాన పత్రాలు అస్థిపంజరాల్లా తలలూపుతున్నాయి.

కిటికీ రెక్క లూ ఘూయబోయాడు.

"అబ్బా ...... వద్దండీ........ఉక్క బోస్తుంటే...."

"అవంతీ...." గిరుక్కున వెనక్కి తిరిగాడు.

అవంతి నిస్సత్తువగా నేలపైకిజారింది

అనంకల్పితంగా అందుకున్నాడు అవంతి ఫోటోను.

అందుబాటుతో మరేదో కవరు.... స్నేహితుడు సూర్యంరాసింది.

"ఒరేయ్....తేజూ... నీ రచనద్వారా కొంత నీ స్నేహంద్వారా మరికొంత నాకూ ఆదర్శాలు వంటపట్టాయేమో మరి నీకు కావాలనే ఓ వితంతువును పెళ్ళి చేసేసుకున్నా. ముందుగా చెప్పడానికి వీలుకాలేదు కాబట్టి భార్యాసమేతంగా నీ ఆశీస్సులకోసం నీ దగ్గరకేవస్తున్నా.... వదహారో తేదీన.. చెల్లాయి అవంతికి నా ఆశీర్వాదాలు....సూర్యం...."

పదహారు....సిక్స్‌టీన్ ....

రెపరెపలాడుతున్న కేలెండర్ రేపే నంటూ గర్జు చేస్తోంది.

ఆదర్శం....

అందరికీ చెప్పేది-తను మాత్రం ఆచరించనిదీ....

హిపోక్రసీ....సొసైటిని వంచించే సుగర్ కోటెడ్ పిల్....

గదిలో గదినిండా గదిబయట భూనభోమండలాలు దద్దరిల్లేట్టు వికటాట్టహాసాలు....




"నో....నో...."

ఫ్రిజ్‌లోని స్కాచ్ విస్కీని అందుకున్నాడు....

రాయల్ సెల్యూట్....

"తాగితే నా మీద ఒట్టే...."

"డోంట్ స్టాప్ మీ...."

మేన్ హేజ్ మేడ్ యూజాఫ్ హిజ్ ఇంటల్లిజన్స్ ఎండ్ ఇన్వెంటెడ్ స్టుపిడిటీ.

గొంతు మంటను మించి నంత గుండె మంట....

"ఇంక పడుకుందా మండీ...."

"నో....ఇవాళ కథపూర్తి కావాలి..."

"అయితే....ఇంకా ఎన్ని పేజీలు రాయాలి...."

"చెప్పలేను....కనీసం అవంతి ఆత్మహత్య....

"అదేమిటండీ....అవంతి ఆత్మహత్య చేసుకుంటుందా"

"ఏం కథలోని నాయికది నీ పేరే కాబట్టి జాలిగా వుందా...."

"అదికాదండీ....భర్త క్షమించాడని తెలుసుకున్నాక కూడా అవంతి ఆత్మహత్య చేసుకోవడం వలాయన వాదమని పించుకోదూ...."

"నో...."

"ఏమిటండీ అలా ఆవేశపడుతున్నారు...."

"ఓహ్....జస్ట్ ఏనెమోషన్... నిజానికి అవంతి ఆత్మహత్య చేసుకోదు.... చేసుకోవాలని ఉత్తరం రాసి టేబుల్‌పై పెడుతుంది....ఇంతలో భర్త రావటమూ ఆమెను వారించటమూ....జరుగుతుంది"

"ఆ తర్వాత...."

"ప్రస్తుతం ఆ ఉత్తరంవరకూ డిక్టేట్ చేస్తాను....తర్వాత కథ సంగతి రేపు ఆలోచిద్దాం...."

## నిశ్శబ్దం

ఇక్కడ
హృదయాలు
రోదిస్తుంటాయి
రాగాలు గొంతు నొక్కుకుని,
సమాధి చేసుకుంటుంటే!
కవులు
కన్నీరు కారుస్తుంటారు-
అక్షరాలలో ఇమడలేక,
భావాలు ఆత్మహత్య చేసుకుంటుంటే!

జ్యోతిస్న

"సరే డిక్టేట్ చెయ్యండి...."

"నా చావుకెవరూ బాధ్యులుకారు...."

"....కారు...."

"దేవుడి లాంటి భర్తను దగాచేసి ధైర్యంగా బ్రతికే శక్తిలేక...."

"....లేక...."

"ఇలా నన్నునేను అంతంచేసుకుంటున్నాను....అవంతి...."

"....అవంతి...."

"రాసేసావా...."

"ఊఁ...."

"ఆ కాగితాల్ని టేబుల్ పైన ఉంచి ఈ హార్లిక్స్ తీసుకో...."

"థేంక్స్...."

"..........."

"ఏమండీ....నాకేదోలా వుంది. కళ్లు తిరుగుతున్నాయి. కడుపు దేవుతోంది.."

"ఇలారా.... నా ఒడిలో తలపెట్టి నిద్రపో...."

"కాదండి.. .నాకేదో...."

"నథింగ్ టు వర్రీ. మరి కొన్ని క్షణాలలో అంతా సర్దుకుంటుంది...."

"ఏమండీ...."

"ఊఁ...."

"ఎం..దు .కా కా..న్ని..ళ్లు చెప్పండి"

"అవంతీ ...అ....వం....తీ...."

ఎక్కడో పిడుగుపడినట్లుగా పెళపెళార్భటాలు....

ప్రళయ ఝంఝూమారుతం....

టేబిల్ పై కాగితాలు ఎగిరి అతని పాదాలను తాకాయి.

రాత్రి అవంతి స్వదస్తూరితో రాసిన ముగిసినకథలోని ముగియని వ్యధకు ప్రతీకలు....

అవంతి లేదు....

ఆ కాగితాలలో కథలోని అవంతి రాసిన ఉత్తరమూలేదు.

వంచనా..దగా..

కలం పోటుతో అవంతిని అంతం చేసిన సత్యానికి సాక్ష్యాలైన శిలాక్షరాలు.

కోల్డ్ బ్లడెడ్ మర్డర్....

పగిలిన ఆదర్శాలకు ప్రతీకలుగా సెగలై రగిలిన అనుమాన జ్వాలలకు సంకేతాలుగా మిగిలిన విషాస్మృతికి అక్షర రూపాలు....

"ఏమండీ....ఇంతటి ఔన్నత్యంగల భర్తను పొందిన నాది నిజంగా అదృష్టమే కదూ...."

"అవంతీ...."

గండిపడినట్టుగా 'స్కాచ్' గుండెల్లోకి పరుగు తీసింది....

వేలాది కుటుంబాలు అనాదిగా వాడ్డబడుతున్న
లవంగనూనె ప్రభావాలన్నింటిని ప్రామిస్‌లో మళ్ళీచూసారు.

# లవంగనూనెతో కూడిన సాటిలేని టూత్‌పేస్ట్ ప్రామిస్

మీరూ ఎందుకు వాడి చూడకూడదు మరి!



**ప్రామిస్**
దంతక్షయమునుండి రక్షణకు
తోడ్పడుతుంది.
నోటినంతా తాజాగా
రూపొందించి
దుర్వాసనను అరికడుతుంది.






బల్సారా ఉత్పాదన

ఆరోగ్యంచిందే పళ్ళు,
చిగుళ్ళు, తాజాశ్వాస-
అదే మరి ప్రామిస్ వాగ్దానం.

CHAITRA-BIS-4053 BT-TEL

* ఖాళీ ట్యూబ్ ఆఫర్ 1982 డిసెంబర్ 31 వరకు
పొడిగింపబడినది - వివరాలకు మీ..
డీలర్‌ను సంప్రదించండి!

ఆక్రోశం....ఉక్రోషం...

వంచన వంచన వంచన వంచన....

మౌన మ్మోన మ్మోన మ్మోనం....

క్రోధంతో కాగితాలను చించాడు....

సన్మాన వస్త్రాలను కుప్పగా పోశాడు.... రాసిన-నగిం రాసిన రచయితను చేసిన సాహిత్యాన్నంతా రాసిగా పోసాడు....

ఆత్మవంచనకు అద్దంలావున్న కాగితాల దొంతరపై స్కాచ్‌ని ఒంపి అగ్గిపెట్టితో అంటించాడు....

అవంతి చితిలా భగభగమంటున్న మంటలు....

వూగిపోతూ రేక్స్‌లోని పుస్తకాలను మంటల్లోకి విసిరాడు...

వైశాటకానందం....తృప్తి..

"లిటరేచర్....ది మోస్ట్ సెడక్టివ్, ది మోస్ట్ డిసీవింగ్, ది మోస్టు డేంజరస్ ఆఫ్ ప్రొఫెషన్స్...."

హేట్సాఫ్ టు 'లార్డ్ మోర్లే'....

కసితో సూట్‌కేస్ తెరిచి నేలపైకి దొర్లించాడు.

కొత్తగా పబ్లిష్ అయిన రచనలు....

మధ్యనుండి జారిన ఓ అందమైన డైరీ....

అలవోకగా అందుకున్నాడు....

అవంతి చేతి వ్రాత....

ఉద్వేగంతో పేజీలు తిరగేసాడు....

ఆగస్టు అయిదు....

"అందరికీ చెప్పే ఆదర్శాలు మా వారు తనెంత వరకూ ఆచరించగలరో చూడాలనిపించింది. అందుకే నేను పెళ్ళి కాకుండానే తల్లినైన దాన్నని ఓ చిన్న అబద్ధం ఆడాను....పాపం .. పిచ్చియన్ని విన్న శ్రీవారు షాక్ తిన్నట్లున్నారు.... కొన్ని రోజులు ఓపికపట్టి తర్వాత నిజం చెప్పాలి....

"అ....వం....తీ...."

గైడెడ్ మిస్సైల్‌లా గుండెను గొంతునూ చీల్చుకొచ్చి ప్రకృతిలో కలిసిపోయింది....

అ....వం....తీ...."

కూలిపోయాడు....

ప్రాణాలు తీసే ప్రాక్టికల్ జోక్....

బయట వర్షం ఉధృతమైంది....

ఉరుములు....మెరుపులు....

గుండెలో మహార్ణవపుహోరు....

ఫ్రిజ్‌లోని స్కాచ్ బాటిల్సన్నీ పగిలాయి....

గదినిండా స్కాచ్....

ఒంటిపై స్కాచ్....

అవంతితో అనురాగాన్ని పంచుకున్న పరువుపై స్కాచ్....

దుఃఖావేశాలతో అవంతి ఫోటోని అందుకున్నాడు....

"అవంతీ....నన్ను క్షమించవూ...."

మంటలు....మంటలు... మంటలు....

మృత్యువులా కోటి నాల్కలతో చుట్టుముట్టిన మంటలు....అగ్నిపునీత సీతలా తదేకంగా చూస్తున్న అవంతి ఫోటోను గుండెలకు హత్తుకుంటూ....

స్మృతుల అవశేషంగా మిగిలిన ఫోటోలోని అవంతి అధరాలను చుంబిస్తూ....

రా రమ్మని పలవరిస్తున్న అవంతి ఆత్మకు చేరువౌతూ....

స్వహస్తాలతో చితిని పేర్చుకున్నటుగా మంటల మధ్య సాగిలబడిపోయాడు తేజోమూర్తి....



ఈ పండుగ వేళలలో... ఆకర్షణీయమైన కొనుగోళ్ళు

KIRON/APCO/82.1/F.




ఆప్కో
చేనేతలు కొనండి




చేనేతలు

పోచంపల్లి, ధర్మవరం,
నారాయణపేటల ప్రకాశవంత
మైన సిల్కుతయారీలు. గద్వాల,
వెంకటగిరి—జాలువారు
జరీలు. తళుకులొలుకు
ఆప్కో సృష్టి అందాలు.
రండి ! ఆప్కోవారి అద్భుత
వస్త్రశ్రేణి నుండి మీరు
కోరుకొన్నవి ఎన్నుకొనండి.

శ్రీ దుర్గామూవీస్

# పూలపల్లకి

అది 1973

ఆంధ్రప్రదేశ్‌లో విజయవాడలాంటి ఓ నగరంలో ఓ మహిళా కళాశాల.

ఆ కళాశాల ఆదరణను మించి అధికారుల ఆదరణను పొందుతున్న సమయమది

ఆ కళాశాల ప్రిన్సిపాల్ - ఆమె తాలూకు బంధువు హాస్టల్ వార్డెన్‌గా మకుటంలేని మహారాణుల్లా వెలుగొందుతున్న తరుణమది.

అది మహిళా కళాశాల అయినా ప్రిన్సిపాల్‌కి సన్నిహితులయినవారు - వార్డెన్ అంతరంగికులు 'ఉమన్స్ హాస్టల్" అని చెప్పబడుతున్న ఆ హాస్టల్‌కి రావచ్చు - పోవచ్చు పైపెచ్చు అధికారులు, అనధికారులు ఆ నగరానికి విచ్చేసి వసతిగృహంలో విశ్రాంతి పొందుతున్నప్పుడు ఆ మహిళా కళాశాల ప్రిన్సిపాల్ ఒకరిద్దరు విద్యార్థుల్ని జత"గా చేసుకొని ఆ ప్రముఖుల్ని



సందర్శించేది. తాను వెళ్ళిన పనిని పూర్తి చేసుకొనేది

ఆ కళాశాలలో-ఆ హాస్టల్ లో డబ్బున్నవారికి లభించిన గౌరవం సౌకర్యాలు డబ్బులేనివారికి లభించవు. డబ్బుంటే ఎన్ని సుఖాలో-ఆ డబ్బు సంపాదించడానికి ఏ మార్గాలు అవలంబించవచ్చో అన్నీ వారే చూపిస్తుండేవారు. ఫలితంగా ఆడంబర జీవితాన్ని అనుభవించడానికి అడ్డదారులు త్రొక్కనారంభించారు ఆ కళాశాల విద్యార్థినులలో కొందరు.

చదువు నేర్చుకోవడానికి వచ్చిన ఆ అమాయక బాలికలలో ఒకరు గర్భవతై ఆత్మహత్య చేసుకొన్నది. మరి కొందరు ఆ సంఘటనతో భయకంపితులై తమ చదువు అర్థాంతరంగా ముగించి ఇంటిముఖం పట్టారు. తండ్రి కుదిర్చిన సంబంధం చేసుకొని గృహిణిగా మారారు.

ఆ అమాయక బాలిక ఆత్మహత్య చేసుకోవడానికి కారకులెవరు? పవిత్ర దేవాలయాల్లాంటి విద్యాలయాలకు ఏ ఉద్దేశంతో తమపిల్లల్ని పంపుతున్నారు తల్లిదండ్రులు.

'ధనిక-పేద' అన్న తారతమ్యం లేకుండా హాస్టల్లో వుంటున్న విద్యార్థినుల నందర్నీ తన కన్నబిడ్డల్లా చూసు



కోవలపిన వార్డెన్ ఆ విద్యార్థినులు ధరించిన దుస్తుల్నిబట్టి వారి ఆర్థిక స్తోమతను అంచనా వేస్తూ ఒకర్ని గౌర వించడం వేరొకర్ని న్యూనతపర్చడం సమంజసమా?

ఈ సంఘటనల్ని దృష్టిలో పెట్టు కొని ఓ నవల రాయడం జరిగింది. ఆ నవలే-"పచ్చని కలశంలో వెచ్చని కన్నీళ్లు". ఈ నవల వెలువడినప్పుడు ప్రతి కళాశాలలోను ఓ చర్చనీయాంశ మయింది.

ఈ నవల హక్కులు తీసుకొని శ్రీ దుర్గా మూవీస్‌వారు కొద్దిపాటి మార్పులతో "పూలపల్లకి" పేరుతో చిత్రం తీశారు.

ఈ చిత్రంలో పరిస్థితులతో రాజీ పడి మూగగా రోదించేవి కొన్ని-పరి స్థితులను ఓ సవాల్‌గా స్వీకరించి ధిక్క రించేవి మరికొన్ని-జీవితంలో అన్ని విధాలా దగాపడి ఈ జీవితాన్నుంచి శాశ్వతంగా నిష్క్రమించేవి ఇంకొన్ని.

ఇందులోని కొన్ని ప్రధానపాత్రలు-పాత్రధారులు.

## స్వప్న (ముచ్చర్ల అరుణ)

నా పేరు స్వప్న.

మాదొక పల్లెటూరు.

స్కూలు చదువు పూర్తి కాగానే మా నాన్న నాకు పెళ్ళి జరిపించేస్తా నన్నాడు. కాని పై చదువుల కెళ్తానని పట్టుబట్టాను. చివరకు నేను, నా



కాని—చదువుకోవడానికి కాలేజీకి వచ్చాం. మా తెలివితేటలకి విలువ కట్టాలి. ప్రతిభావంతులకి గౌరవం ఇవ్వాలి. కాని, మేము కట్టే బట్టల్ని బట్టి మా ఆర్థిక స్తోమతును బేరీజు వేయడమేమిటి? విలువఇవ్వటమేమిటి? పేదవార్ని అపహాస్యం చేయడమేమిటి? ఈ విద్యాలయాలు డబ్బున్నవారికేనా? నాలాంటిపేదవారు ఎన్నో అవమానాల నెదుర్కొంటూ చదవలేక చదవవల సిందేనా?

ఎలాగూ కాలేజీ చదువుకి స్వస్తి చెప్పాలనుకున్న నేను డబ్బున్నవారి అడుగులకి మడుగులొత్తే పెంపుడు కుక్కలకు బుద్ధి చెప్పాలనుకున్నాను. మెడలోని బంగారపుగొలుసు అమ్మాను. రెండు నెలలవరకు ఖర్చులకు సరిపో తుందని దాచుకున్న అయిదొందలు నా స్నేహితురాలు పావని దగ్గరున్న అయిదొందలు తీసుకొని ఆధునికమైన దుస్తులు కొన్నాను. మా నాన్న బిజి నెస్ మాగ్నెట్ అని....ఎయిర్ కండి షను రూములో, రివాల్వింగ్ చైర్‌లో కూర్చున్నా కాకీబట్టలు వేసుకున్న వర్కర్ల స్థితిగతులు-అతడి ఆలోచనా ధోరణి తెలుసుకోగలిగిన రోజునే బిజినెస్ ఇంప్రూవ్ చేయగలమని నాన్నగారు చెప్పడంలో ఓ సాధారణ యువతిగా హాస్టల్‌లోకి అడుగు పెట్టానని కల్ల బొల్లి కబురు చెప్పి నమ్మించాను. నా మోడ్రన్ డ్రస్ అందర్నీ మోసం చేసింది. పూర్వం కాంటీన్ కెళ్తే నా



డబ్బుతో నేను టీ త్రాగేదాన్ని. కాని ఇప్పుడు నా స్నేహంకోసం ప్రాకులాడేవారు నా డబ్బుతో నా టీ కూడా త్రాగనివ్వటంలేదు. లక్షాధికారి కూతుర్నైన నన్ను ప్రేమ పేరుతో పెళ్ళి జేసుకోవాలని ఎందరో అబ్బాయిలు పోటీ పడ్డారు....విలువైన కానుకలిచ్చారు.

కాని ఒకరోజున....నన్ను వెంక్కంటూ మా నాన్న వచ్చాడు. ఆ తర్వాత ఏం జరిగింది....వార్డెన్ దగ్గర్నుంచి అందరికీ గుణపాఠం చెప్పాలనుకున్న నేను నా ప్రయత్నంలో ఎంతవరకు సఫలీకృతురాలన్నయ్యాను? అన్నది "పూలపల్లకీ" చూసి మీరే చెప్పాలి.

## పావని (లక్ష్మీచిత్ర)

నా పేరు పావని. స్వప్న స్నేహితురాల్ని. హాస్టల్ రూమ్మేట్ని. స్వప్నలా జీవితంలో "టాస్" వేసే ధైర్యం లేనిదాన్ని. పరిస్థితులతో రాజీ పడటం నా తత్వం. నాకు తల్లి లేదు. మా నాన్నగారే నన్ను పెంచి పెద్ద చేశారు. కాలేజీ శెలవులకి ఇంటికి వెళ్ళినప్పుడు, "అమ్మా! నేను బ్రతికి సంవత్సరం బ్రతకను. ఏదో నిన్ను ఓ ఇంటిదాన్ని చేస్తే చంద్రికా నా బాధ్యత నిర్వర్తించినవాడ్నవుతాను" అన్నారు.

కాలేజీలో రోజులింక గండంగా వుంది. డబ్బులేని మమ్మల్ని ద్వితీయ శ్రేణి పౌరుల్లా-అంటరానివాళ్ళ చూసినట్లు చూస్తున్నారు. ఇక కాలేజీ చదువు కొనసాగించడం నావల్ల కాదనుకున్నాను. మా నాన్నగారు చెప్పినదే చేయాలనుకున్నాను. స్వప్న వ్యతిరేకించింది

"నిజమే. అన్ని అవమానాలు దిగమింగి చదువుతాను. కాని చదువుకున్న దాన్నిగదా అని కట్నం లేకుండా ఎవరైనా నన్ను పెళ్ళి చేసుకుంటారా? పై చదువులు చదివినకొద్దీ మనకు సమానంగా చదివిన పెళ్ళికొడుకుని తీసుకురావాలి. హెచ్చుమొత్తాల్లో కట్నం చెల్లించాలి. తక్కువ చదువుకున్నవారిని మనం పెళ్ళి చేసుకోవాలనుకున్నా ఎక్కువ చదువుకున్న పెళ్ళాం ఎవరికి కావాలి? అని ఎవరూ ముందుకురారు" అని మా నాన్నగారు తీసుకొచ్చిన పెళ్ళికొడుకునే చేసుకున్నాను.

తర్వాతగాని ఆయన అసలు రంగు బయటపడలేదు. ఆయనకు లేని వ్యసనం లేదు. చివరకు పుస్తెకూడా తీసికెళ్ళి తాకట్టు పెట్టుకున్నాడు. ఈ విషయాలు నాన్నగారికి తెలిస్తే ఏమయిపోతారోనని నేను సుఖంగా బ్రతుకుతున్నట్టు ఆయనదగ్గర నటించాను. ఈ నాటకమూ ఎంతోకాలం సాగలేదు. ఒకరోజున ఆయన పేకాటలో బాకీపడి, ఆ బాకీ తీర్చానికి ఎవరో ఒకర్ని నా దగ్గరకు తీసుకొచ్చారు. ఎంతోసుఖంగా సాగిపోతున్న తన కూతురు సంసారాన్ని చూద్దామని సరిగ్గా అదే సమయానికి మా నాన్నగారు కూడా మా ఇంటికొచ్చారు.

"నేనెలా బ్రతుకుతున్నాననేది కాదు ముఖ్యం-నాగురించి మా నాన్న ఏమనుకుంటున్నారన్నది ముఖ్యం" అనుకొని ఆయనదగ్గర ఏవేవో నాటకమాడాను. జీవితంలో నేనెలాగూ మోసపోయాను. కాని కన్నకూతురుజీవితం

బుగ్గిపాలయిందని ఆ ముసలి తండ్రి వ్యథ చెందకూడదన్నదే నా ప్రయత్నం.

ఇహ నేనెవరికోసం బ్రతకాలి?

భర్త చేసిన అప్పులు తీర్చడానికి పదిమంది కౌగిళ్ళలో నలగడానికా?

ఇల్లు-తల తాకట్టుపెట్టి పెళ్ళిచేసిన తండ్రిపై ఆధారపడి బ్రతకడానికా?

కనీసం చదువుకొనివున్నా నా బ్రతుకు నేను బ్రతకగలిగేదాన్నేమో!

నా స్థితిలో వున్న ఏ ఆడపిల్లయినా ఏం చేస్తుందో మీరే చెప్పండి!

## జ్యోతి (దేవికారాణి)

స్వప్న-పావనికి కన్నవారయినా వున్నారు. నాకు ఆ దిక్కూ లేదు. అక్క, బావల దయాదాక్షిణ్యాలతో చదువుకుంటున్నాను. మా బావ నాలుగొందల రూపాయల సామాన్య ఉద్యోగి. అంటే నా ఆర్థిక పరిస్థితిని ఊహించండి.

నా రూమ్‌మేట్ ఫణికి 'పజిల్స్' పిచ్చి. ఓరోజు ఫణి అడిగింది.-మనిషి బతకడానికి ఏది ముఖ్యం-" అందమా? ఆరా? డబ్బా?" అని. నాకు డబ్బు లేదు-అయినా అందముంది. ఆ అందాన్ని సొంతం చేసుకోవాలనే 'మనూ' లాంటి లక్షాధికారి నా వెంట పడ్డాడు. నేను కోరినవన్నీ ఇచ్చాడు. కావలసినదంతా నానుంచిపొందాడు.

కాని, మనిషి బ్రతకడానికి 'అందం' ఒక్కటే చాలదని తెలుసుకోవడానికెంతో కాలం పట్టలేదు. "స్వప్న"-ఓ అందగత్తె కాలేజీలో చేరడంతో అప్పటివరకు నన్ను పెళ్ళి చేసుకుంటానని నమ్మించిన "మనూ" ఆమె చుట్టూ ప్రదక్షిణం చేయడం ప్రారంభించాడు. నేను తల్లిని కాబోతున్నానన్న "నిజం" తెలిసింది. కాని "స్వప్న" ఓ లక్షాధికారి కూతురని తెలిసిన మనూ తనకు నాతో పరిచయం లేనట్టే తిరగసాగాడు. అతడు నన్ను పెళ్ళి చేసుకుంటాడన్న "ఆశ" కూడా చావడంతో-"డబ్బు"లేని నాకు "చావే" శరణ్యమనుకున్నాను. అక్కడా విఫలమయ్యాను. ఆత్మహత్యా ప్రయత్నం క్రింద పోలీసులు అరెస్టు చేశారు. చివరకు స్వప్న సహాయంతో బైటపడ్డాను.

పేదపిల్లగా పుట్టడం నా తప్పుకాదు పైచదువులకి వెళ్లాలనుకోవడమూ తప్పుకాదు. కాని, కాలేజీ హాస్టల్‌లో కన్నతల్లిని మరిపించవలసిన వార్డెన్ నన్ను మనూకి పరిచయం చేసింది. జీవితంలో 'సుఖపడటానికి ద్వారాలు తెరచింది. నేను చేస్తున్నది తప్పు అని తెలుసుకునేసరికే నా గర్భంలో శిశువు మెదులుతోంది. నేను చేయని తప్పుకి తల్లిలాంటి వార్డెన్ జీవితాంతం అనుభవించమని పెద్ద శిక్ష విధించింది.

అశుభం శుభం తెలియని-లోకం చూడని నా గర్భంలోని శిశువు ఏ పాపం చేసిందని తల్లిగా నేనీ శిక్ష విధించను?

పెళ్ళిగాని తల్లి కాబోతున్న ఓ ఆడపిల్లగా-నా పరిస్థితి మీకు వివరించాను. నన్నేం చేయమంటారు?

## ముక్తాయింపు :

ఎన్నో ఆశలతో, ఆశయాలతో కాలేజీ ప్రాంగణంలోకి అడుగుపెట్టే విద్యార్థినుల జీవితాల్లో తొంగిచూసే

వివిధ సంఘటనల సమగ్ర రూప కల్పన కాలేజీ విద్యార్థినుల హాస్టల్ జీవితాన్ని తొలిసారిగా తెరపై చూపుతున్న వర్ణచిత్రం

"సీతాకోకచిలుక" సంగీత దర్శకుడు ఇళయరాజా ఈ చిత్రానికి సంగీత దర్శకత్వం వహించారు. ఈ చిత్రం రీ-రికార్డింగ్ జరుగుతున్నప్పుడు సుప్రసిద్ధ హిందీ సినీ సంగీత దర్శకుడు ఆర్. డి. బర్మన్ చిత్రంలోని పాటలు విని అభినందనలందజేశారు. ఉత్తమ ఛాయాగ్రాహకుడుగా అవార్డులందుకున్న మధు అంబట్ ఈ చిత్రానికి ఛాయాగ్రాహకుడు. దర్శకుడు, ఉమామహేశ్వరరావు. మాటల రచయిత చిట్టిబాబు, నిర్మాత కోనేరు అమ్మాజీ. తోటకూర ఆశాలత "పచ్చని కలశంతో వెచ్చని కన్నీళ్లు" ఆధారంగా ఈ చిత్రం నిర్మించబడింది.

పంపిణీదారులు: లక్ష్మీ చిత్ర, శ్రీ లక్ష్మీచిత్ర

**నటీనటులు**

ముచ్చర్ల అరుణ
లక్ష్మీచిత్ర
దేవిరాణి
ప్రతాప్ పోతన్
శ్రీధర్
చరణ్ ప్రసాద్
ఏ. యల్. నారాయణ
భానుచందర్
శశికాంత్
కర్నాటి లక్ష్మీనరసయ్య
కొల్లి రాఘవేంద్రరావు



విజయ బాపినీడు నిర్మాణంలో

శ్రీ వినాయకా ప్రొడక్షన్స్

# పట్నం వచ్చిన పతివ్రతలు

దర్శకత్వం మౌళి

నవల: అట్లూరి రాధాకృష్ణమూర్తి - కొమ్మన నారాయణరావు

Bhaskar

లక్ష్మీ ఫిలింస్

JYOTI

NOV 82

# మంచుపల్లకీ

## 'దేశానికి వెన్నెముక యువత'

అని మన రాజకీయ నాయకులూ, మేధావులూ ఏకగ్రీవంగా నిర్ణయించేశారు.
వారే ఆ వెన్నెముకను విరిచేస్తున్నారు నిర్దాక్షిణ్యంగా.

ఆ యువతకు ప్రతీకలుగా,
అధికారుల అతిశయానికి,
నిరుద్యోగ రాక్షసికి,
ఎదుగూ బొదుగూ లేని
మధ్యతరగతి తనానికి
మోసానికి,
అవినీతికి,
అనాదరణకూ,
గుర్తైన ఐదుగురు మిత్రులు···





ఓ శుభోదయాన
ఈ ఐదుగురి జీవితాల్లోకి,
ఓ మంచు కిరణం చల్లగా ప్రవేశించింది.
జీవితంతో, సమస్యలతో విసిగి వేసారిపోయిన వారిని
కన్నతల్లిలా,
గురువులా,
సోదరిలా
ప్రేయసిలా
ఆదరించి, చైతన్యం తీసుకొచ్చి తను మంచుపల్లకిలా చల్లగా తప్పుకొంది.

ఆ మంచు కిరణం - సుహాసిని.

ఆ ఐదుగురూ - చిరంజీవి, సాయిచంద్, నారాయణరావు, రాజేంద్రప్రసాద్, గిరీష్.

ప్రేక్షకుడి గుండె గొంతుకలోన కొట్టాడించారు యువదర్శకుడు వంశీ.

జ్యోతి మాసపత్రికలో సహాయ సంపాదకుడుగా పనిచేసిన శ్రీ వేమూరి సత్యనారాయణ ఈ చిత్రాన్ని సమర్పిస్తున్నారు.

కళ



చంద్ర

ఫోటోగ్రఫీ



హరి

సంభాషణలు



యండమూరి

దర్శకత్వం



వంశీ




స్టేషను గోలగా సంతలా వుంది. తోసుకుపోయేవాళ్లు; సామాను మోసుకు పోయేవాళ్లు.

పుస్తకాలు, పెన్నులు, కళ్ళజోళ్లు, సిగరెట్లు, అరటిపళ్ళు అమ్ముకొనేవాళ్ళ కీచుగొంతు అరుపులు. అరుపుల్లో అధికారపు గొంతులు "కాఫీ" "టీ"లవి! ఆ వ్యాపారాల్ని వృద్ధిచేస్తూ పిలిచి కొనే వాళ్ళూ....అరుపులు....కేకలు సంతలా.

సుధకి కిటికీ ప్రక్క సీటు దొరక లేదు ప్రయత్నించినా-సుధ ఎక్కినరైలు ఓ నిమిషంలో బయల్దేరుతుంది. రైలు త్వరగా రానందుకు, వచ్చి వెంటనే బయలేరి పోనందుకు-ఆ వాతావరణం, సుధ వీడ్కోలు జాగ్రత్తలూ, నన్ను చిరాకు పెడుతున్నాయి. సుధ చెప్పేది బుద్ధిగా వింటున్నటు శాయశక్తులా నటిస్తు న్నాను. అలా వింటున్నట్టుండక పోతే ఆవిడ అలుగుతుంది.

"ఉంది కదాని ఆ గోంగూరపచ్చడి రోజూ వేసుకోకండి. వెంకట లక్ష్మికి తాళాలివ్వకండి. మీరులేనప్పుడు పెరడు పని చేయమని చెప్పండి. వాళ్ళకేంటి అవకాశం దొరికితే దేన్నైనా మింగే స్తారు ..." ఆవిడపెదవులు ఏవో తింటు న్నట్లు అలా కదులుతూ శబ్దంచేస్తూనే ఉంటాయి.

సుధ చెప్తూనేఉంది ఆ అరుపుల్లో కేకల్లో....సంతలో....స్టేషన్లో....

"మమ్మీ" వాడు వాళ్ళమ్మని విడిచి ఒక్క క్షణం ఉండడు సీటు ఎవరో ఆక్రమించేసుకొంటారని వాడి భయం వాడిది.

"వస్తూన్నాన్రా....కూర్చో" వాడికి

జరా చెప్పి-కిటికీలోంచి మళ్ళీ వన్స్ చూస్తూ ఆ ప్లైట్ కొనసాగించ బోయింది.

'ఎవరో సీట్లో కూర్చున్నాయన మంచి వంగి కిటికీలోంచి తనకి సుధ జాగ్రత్తలు చెపుతోంటే – కోపం వస్తోంది. ఏమిటీ ఆడవాళ్ళు. పరాయివాళ్ళు వింటున్నారన్న ధ్యాస లేకుండా – మగాళ్ళు పెళ్ళాలు లేకపోతే ఏమీ చేసుకోలేనట్లు.

రైలు గట్టిగా అరిచి....కదిలింది.

"ఉత్తరం రాయి." పెదవులు విడదీసి పలికాను రైలుతో పరుగుస్తూ.

రైలు స్పీడు అందుకుంది. ఆగిపోయాను చెయ్యెత్తి ఊపుతూ.

సుధ లోపలికి సర్దుకుంది.

రైలు క్రమంగా కనుమరుగైంది.

టైము ఏడూనలభై ఐదు.

నేను బైటకొచ్చి రిక్షా ఎక్కాను, ఎక్కడికి పోవాలోచెప్పి. రిక్షాలో వెళుతోంటే ఉదయపు చెంత, మొహంకూడా కడిగని మొహం మీదపడుతోంటేచిరాగ్గా వుంది.

రిక్షా ఆపి సోడా వేయించాను.

భార్యని ఇంటికి వెళుతుంటే హాయిగా ఉంది.

ం ం ం ం

రిక్షాదిగి ఇంట్లోకి అడుగు పెడుతూ షర్టు విప్పి మంచం మీదకు గిరాటువేస్తూ లుంగీ కోసం వెదికాను. కనిపించలేదు

"లక్ష్మీ" పెరట్లోకి కేక వేసాను.

లక్ష్మివచ్చి నిలబడింది.

"అమ్మగార్ని రైలెక్కించేసారా?"

"ఎక్కించేసాను కానీ, లుంగీకూడా ఉతికేస్తున్నావా?"

"అమ్మగారు వడేసారునీళ్ళలో...."

"సరేలే....నీళ్ళుపెట్టు"

పెరట్లోకి, నూతి గట్టుమీద బట్టలుతకడానికి వెళ్ళిపోతోందిలక్ష్మి. వెనుకనుండి చూడ్డానికి ఆమె అందం బావుంటుంది. అలాగే చూస్తూ నించున్నాను కనిపించేంత వరకూ.

గెడ్డం గీసుకొని, ఫ్లాస్కులోని కాఫీ ఒంచుకొని తాగుతుంటే చెప్పింది లక్ష్మి వచ్చి.

"ఫ్లాస్కులోకి కాఫీ పెట్టాలా?"

"వూఁ!"

ఆమె వెళ్ళింది

తలకి స్నానంచేసి, కొత్తలుంగీ కట్టుకొని, ఫ్యాన్ క్రింద కూర్చొని రేడియో వింటుంటే టిఫిన్ బాక్స్, ఫ్లాస్కు టేబిలు మీద పెట్టింది లక్ష్మి.

సుధచేసే అన్ని పనలూ పనిమనిషి లక్ష్మి చేయగలదు– ఆమెకంటే నిజాయితీగా.

బ్యాంకుకి వెళ్ళడానికి తయారయి "ఇలారా" అన్నాను లక్ష్మితో.

నవ్వుతూనేవచ్చి నిలుచుంది,

"సుధచేసే పనలన్నీ నువ్వు చేసిపెట్టావ్.. .ఆఫీసుకి వెళ్ళేముందు సుధకి ఇచ్చే బహుమతి నీకూ ఇవ్వనా!"

"వద్దు" అంది.

ఆమె అన్నీ చక్కగా అర్థం చేసుకొంది. అందుకే లక్ష్మి అంటే ఇష్టం.

"ఏమిటిస్తానో తెలియకుండానే వద్దంటున్నావేం?"

"తెలుసు"

"ఏమిటి?" అడిగాను చెప్పించాలని.

"సంవత్సరం నుండీ వస్తేస్తున్నాను.




ఆ మాత్రం తెలీదా?" నవ్వుతూ వెళ్ళిపో బోయింది,

"ఆగాగు" చటుక్కున చెయ్యిపట్టుకొని ఆపాను.

జబ్బమీద చెయ్యి వేస్తూ అన్నాను. "రాత్రి నీ పడక ఇక్కడే"

"అమ్మగారెప్పుడొస్తారు?"

"మూడు నెలలు అమ్మగారింట్లోనే వుంటుంది. మధ్యలో రెండుమూడుసార్లు నేనే వెళ్ళి చూసొస్తాను."

"మా నాన్నతో చెప్పి ఒప్పుకుంటే పడుకోడానికి వస్తాను"

"అయ్యగారు ఊరెళ్లారని, అమ్మగారికి తోడు పడుకోమన్నారని పాత అబద్ధం చెప్పు"

"భయంగా వుంది."

"ఆఁ....గాడిదగుడ్డు.... రాత్రికెలాగైనా వుండాలి.... ఆఁ.... నేను వెళుతున్నాను." తాళాలు ఆమెకిచ్చి ఆఫీసుకి బయల్దేరాను.

o o o o

టైము రాత్రి తొమ్మిది నలభై కావస్తోంది.

లక్ష్మి వంటింట్లో భోజనం చేస్తోంది, సుధ చీరకట్టుకొని కుర్చీలో కూర్చొని.

ఆమెనలా చూసినవారు పని మనిషను కోరు. ఇంటి ఇల్లాలను కుంటారు.

సుధ!

తనది ఎక్కువ మాట్లాడే తత్వం కాదు. విని తన అభిప్రాయాలు పైకి చెప్పదు. చిన్నప్పటి నుండీ తన అలవాటది. ఆతత్వాన్ని సుధ అలుసుగా తీసుకొంది. లేనిపోని అధికారాలు భర్తమీద చెలాయించడానికి ప్రయత్నిస్తుంది.

సుధలో స్త్రీత్వం తనకి కనపడ్డం లేదు,

...పొన్ను చేతుల ఉన్న మనిషిలా వెళ్ళయింది కాబట్టి కలసి వున్నట్టు అని పిస్తుంది.

భర్తగా కాకుండా మూడో వ్యక్తిగా సుధని గమనించినపుడు ఆమెలో అందం కనిపిస్తుంది. భార్యగా ఆమె తనకి యంత్రంలా....పాటలు వినిపించే రేడియోలు, గాలి వీచే ఫ్యానులా, మంచంలా ....జీవం లేనట్టు.... కాగితం పువ్వులు..

లక్ష్మి అడుగుల చప్పుడు సుధ ఆలోచనల్ని తరిమేసాయి,

మంచం మీద పడుకున్న తనకి ఎదురుగా కుర్చీలో కూర్చుంది. అరచేతిలోని గోరింటాకురంగుని గమనిస్తూ తలొంచుకొని కూర్చొంది.

లక్ష్మిలోని ఆమె ప్రవర్తనే తనని ఊపేస్తుంది.

చనువు తీసుకొని పోరవగా ఎంత చిన్న మాటన్నా ఆమె సిగ్గు పడుతుంది. అలాంటి మాట తనకి తానుగా ఒక్క మాటా మాట్లాడదు.

ఏ చిలిపి మాటవిన్నా కను బొమ్మలు ముడుచుకుపోతాయి ముక్కు టికిలిస్తుంది పెదవులు బిగిసిపోతాయి మనస్సు కుచించుకుపోతుంది.

అదే... అదే తనని వెర్రెత్తిస్తుంది.

ఏ చిన్నవాదనలోనైనా అందంగా ఓడిపోయి గెలుస్తుంది.

ఆ స్త్రీత్వమే తనని వివసుణ్ణి చేస్తుంది.

"లక్ష్మి ఇలావచ్చి పక్కన కూర్చో"

తలొంచుకొని వచ్చి కూర్చుంది.

"నేను బావుంటానా?"

... ....ముడుచుకొన్న పెదవులు కొంచెం సాగి చిరునవ్వు.

"నేనంటే నీకిష్టమేనా?"

"... " అదే చిరునవ్వు

"ఊఁ ...చెప్పు?"

కొంచెంసేపాగి "లేకపోతే నాన్నకి అబద్ధంచెప్పి ఇన్నిసార్లెందుకొస్తాను?" అంటూ తన వక్కలో బోర్లా పడుకొని ముడుచుకుపోయింది. రెండు చేతులూ మొహానికి దాటుచేసుకొని

లేచివెళ్ళి లైటుతీసేసాను.

● ○ ○ ○

బ్యాంకులో పని ఒత్తిడి ఎక్కువగా వుంది.

కలెక్టరుగారి చేతుల మీదుగా నారాయణపురం గ్రామస్తులకు ఋణాలు ఇప్పించడానికి బి. డి. ఓ. సమితి ప్రెసిడెంట్ తనని ఒప్పించారు.

నూరుమందికి గేదెలు కొనుక్కోవడానికి ఋణాలు.

ఈ గేదెలఋణాలంటే తనకుచిరాకు. అందులోనూ ఒకే ఊరుకు నూరు. ఎక్కడ్నించి వస్తాయి ఒకేసారి అన్ని గేదెలు? వాటిని ఎంపెట్టి మేపుతారు?

గ్రామస్తులు చాలా తెలివైనవాళ్లు.

వాళ్లు ఋణాలతో గేదెలు కొనరు. ఉన్నవాటినే చూపిస్తారు పశువుల డాక్టర్‌కి ఐదోపదో రూపాయలిచ్చి కొన్నట్టు రాయించుకొంటారు.

సన్నకారు రైతులమంటూకరణంచేత రాయించుకొని వందరూపాయలదాకా ఖర్చుపెట్టి ఋణంలో మూడోవంతు సబ్సిడీ లిప్పించుకొంటారు.

ఈ సంగతి అందరికీ తెలుసు. ఐనా ఎవరూ పట్టించుకోరు.

ప్రజానాయకులు ఓట్ల కోసం ఈ పనులు చేస్తారు. ప్రభుత్వ యంత్రాంగం ఏదో చేసినట్లు చెప్పుకోడానికి వెనకేయడానికీ, ఈపనులు చేస్తారు. గ్రామస్థులు అమాయకమైన స్వార్థంతో ఈ పనులు చేస్తారు. ఒచ్చే సబ్సిడీకోసం ఈఋణాలు అవసరం లేక పోయినా తీసుకొంటారు. ఆ సబ్సిడీ రావడానికి, వచ్చే సబ్సిడీ అంత డబ్బు గ్రామస్థులు లంచాలుగా ఇస్తారు-లెక్క తెలియనివారి మనస్తత్వం ఎప్పుడు మారుతుందో?

ఋణాల కాగితాలు రాస్తున్న తన దగ్గరకు హడావిడిగా రామ్మూర్తి వచ్చాడు.

కూర్చోబెట్టి "ఏమిటి సంగతి" అడిగాడు

రామ్మూర్తి తాలూకాఫీసు గుమస్తా. బాగా పాతవాడు, ఓ సాంస్కృతిక కార్యక్రమంలో పరిచయమయ్యాడు. అప్పటి నుండే అడపా దడపా కలుస్తుంటాడు. అతని అకౌంట్ లో తన బ్రాంచిలోనే వుంది.

"మీరెలాగైనా ఈసహాయం చేయాలి"

"చెప్పండి"

ఆయన సందేహించడం గమనించి బి. డి. ఒ. ని బైటకి వెళ్ళమన్నాడు.

అర్ధాం తలుపు వేసి వస్తూ చెప్పాడు రామ్మూర్తి.

"మూడువేలు కావాలి"

"ఎందుకు?"

"నా భార్యను మీరు ఓ సారి సినిమా హాల్లో చూసారు బలవంతంగా చేసుకోవలసి వచ్చింది. అదో కథలెండి. నిర్మలని మా బంధువులమ్మాయే. ఆమె నాకు దగ్గరయ్యింది. శాశ్వతంగా ఉండి పోతానంటోంది. ఆమె పోషణకు ఓదారి చూపాలిగా, బక్ షాపు ప్రారంభిస్తానంది మీరు అప్పు ఇవ్వాలి."

"మరి మీ భార్యకు తెలిస్తే?"

"ఏం జేస్తుంది. రెండ్రోజులు మొత్తుకుంటుంది. తర్వాత పడి వుంటుంది. పడుండక ఏం జేస్తుంది?"

"లోను ఇస్తాను కానీ-నిర్మలని ఉంచుకుంటున్నారా? పెళ్ళి చేసుకుంటున్నారా?"

"పెళ్ళిచేసుకొంటే డిస్మిస్ అవుతుంది సార్! కేసులవీ ప్రమాదం"

"పెళ్ళిచేసుకోకుండా నీతోనే ఎందుకు ఉంటానంది?"

గర్వంగా అన్నాడు "నేనంటే-ఇష్టం"

ఒకరంటే ఒకరికి ఇష్టం గల ఆడ మగ కలిసి ఉండే మార్గం ఇదేనా?

పెళ్ళయి పోతే ఇంతేనేమో:!

o o o

"ఎందుకా పేరు పెట్టారు?" అడిగింది లక్ష్మి,

సుధ ఆడపిల్లని ప్రసవించిందని అత్తారింటికి వెళ్ళివచ్చి నామకరణంరోజు అనంతలక్ష్మి పేరుపెట్టి వచ్చింతరువాత చెప్తే లక్ష్మి అడిగిన ప్రశ్న అది.

ఈలోపు అమ్మ ఒకసారి, బావమరిది రెండుసార్లు ఇంటికి వచ్చి వెళ్ళారు.

"నీపేరు కలిసుంటుందని"

"నిజంగా"

"నిజంగా" చెప్పాను నిజం.

"మరి అమ్మగారంటే ఇష్టం లేదా?"

"నీ అంత లేదు"

"ఏం? మరి పెళ్ళి చేసుకున్నారు!"

"పెళ్ళయిన వాళ్ళంతా సుఖ పడితే






ఇన్ని గొడవలెందుకు బ్రతుకుతో- ఇన్ని బాధలెందుకు? అంతా ఎందుకు నీ భర్త ఏం చేసాడు?"

"అడికేమీ తెలీక పోయాడు"

"ఏమిటి తెలీక?" అడిగాను.

"మానాన్న వలె పారి పోయాడు. మా ఇద్దరికీ ఇష్టంగానే ఉండేది. సంపాదించేవాడు కాదని నాన్న రోజూ తిట్టేవాడు. కుర్రతనం మీద సినిమాలకీ, సరదాలకీ తిరగాలనుండేది ఓసారలా వెళ్ళి పోయి రెండ్రోజుల తర్వాత వస్తే నాన్నకి కోపం వచ్చి కొట్టాడు. అతగాడికి ఎవరూ లేరని దూరపు చుట్టమే అవుతాడు.... చేరదీసి నాకు పెళ్ళి చేసాడు. నాన్నమీద తిరగబడి తిరిగి దెబ్బ తీసుకొని పారి పోయాడు. అదే పోవడం-మళ్ళీ రాలేదు. పదిహేనేళ్ళవుతుంది."

"ఆయన పేరేంటి?"

"రాజారావు"

"బావుంటాడా!"

"మీ అంత బావుంటాడు,"

"మధ్యలో ఎప్పుడైనా వచ్చాడా?"

"లేదు

"అతనితో నువ్వెన్నేళ్ళు కాపురం చేశావ్?"

"ఏళ్ళెక్కడా? ఆర్నెల్లు"

"మరిప్పుడేం చేయాలనుకుంటున్నావ్."

".... మాట్లాడలేదు లక్ష్మి.

"అంట్లు తోముతూ బ్రతుకుతుంటే జీవితం బోరు కొట్టదా?"

"అంటే-?" బోరు అన్న పదం అర్థం కానందుకు చిరాకు.

"విసుగు పుట్టడం లేదా?"

"కడుపు కాలుతుంటే-పని చేయడానికి విసుగు పుట్టదు"

"గొప్ప సూత్రం కనిపెట్టావ్"

"ఎవరో ఒకరి మగ అండ నీకు అవసరం కాదా?"

"నాన్న బ్రతికే ఉన్నాడు."

"అలాంటి అండ కాదు. తోడు"

ఇంతకంటే ముందు కెళ్ళలేక పోయాను.

ఇద్దరి మధ్యా ఉల్లిపొరలాంటి తెర అడ్డం ఉంది. అది మొహమాటంతో కూడుకొన్నది. ఆసంగతి తనకి తెలిసినా తొలగించలేక పోయాడు. ఛేదించి ఆమె అభిప్రాయం తెలుసుకోలేక పోయాడు. తిరస్కరిస్తుందేమోనన్న భయం- సందేహం-అహం.

ఎంత చనువున్న మనుషుల మధ్యనన్నా - తెరఅడుతుంది, అది మనిషి తత్వమేమో.

o o o

ప్రియమైన శ్రీవారికి

క్షేమం. మీరు క్షేమమని తెలుస్తాను. వచ్చే సోమవారం మంచిదని పంతులుగారు చెప్పారట. మీరువచ్చి నన్ను తీసుకెళ్ళండి. రెండురోజులుండేలా రండి. శనివారం శెలవు పెట్టి శుక్రవారం సాయంత్రం రండి.

అనంతలక్ష్మి ఎప్పుడూ ఏడుపే. పెద్దాడు బాగా అల్లరి వాడయిపోయాడు. ఇంతదాకా మీకు ఇబ్బంది కలిగించాను. ఎప్పుడెప్పుడూ ఇలా బాధలు పడుతుంటేనే సుఖం విలువ తెలుస్తుంటుంది.

మీకు చేరువకావాలని తహతహలాడుతున్నాను.

మీ

సుధ

దూరం అభిమానాలనూ, ఆపేక్షలనూ పెంచుతుంది. సుధ మళ్ళీ ఇంటికి వస్తోందని గుర్తుకొస్తుంటే ఏదో వెలితి.

ఆ సాయంత్రం వెంకటలక్ష్మిని పిలిచి చెప్పాను. "సుధ వస్తోందని".

తలొంచుకొని కాలి బొటన వేలితో నేల రాస్తూండి పోయింది.

"రా. లోపలకొచ్చికూర్చో."ఇంట్లోకి తోవ తీసాను.

అనుసరించింది.

కూర్చుంటూ అడిగాను. "ఏంబాధగా ఉందా?"

ఆమె దించుకొన్న కళ్ళలోంచి కన్నీటి బొట్లు వరుసగా రాలాయి.

"నిన్నొకటి అడగాలనుంది" అన్నాను నిశ్శబ్దాన్ని తరిమేస్తూ.

చెంగుతో కళ్ళొత్తుకొంటూ అంది-

"మీరడిగేముందు నేనొకటి అడుగుతాను".

నా గుండె వేగం పెరిగింది. బాగా చలిలో సిగరెట్టు దమ్ము గట్టిగా లాగినట్టు.

"ఇవాళ నన్ను సినిమాకి తీసికెళ్ళండి"

రెండు నిమిషాల నా మౌనం అనంతరం ఆమె మళ్ళీ రెట్టించింతరువాత అన్నాను.

"రెండో ఆటకి వెళ్దాం"

"మీరేదో అడుగుతానన్నారు" అంది లక్ష్మి.

"రేపు సాయంత్రం అడుగుతాను."

అడగడానికి ఏదో ఇద్దరిమధ్యా తెర పుల్లిపొరంత భయం.... సందేహం....

జ్యోతి

అహం....

° ° ° °

సాయంత్రం లక్ష్మి ఇంట్లో కనిపించ లేదు.

ఉదయ పని ముగించుకొని ఇంటికి వెళ్ళింది మళ్ళీ వచ్చినట్లులేదు.

లక్ష్మి పనిలోకి ఎందుకురాలేదు?

సాయంత్రం తీరిగ్గా చాలావిషయాలు ఆమె భవిష్యత్తుకి సంబంధించిన విష యాలు మాట్లాడాలని తను స్పష్ట గా చెప్పాడే.

రాత్రి లక్ష్మినికూడా బాల్కనీకి తీసి కెళితేబావుడును. ఆమెకితుర్చి టిక్కెట్ తీసి వంటరిగా పంపి తను బాల్కనీ లో కూర్చున్నాడు

పచ్చేటప్పుడు రిక్షాగూడు వేయించి ఆమె ప్రక్కనే కూర్చున్నాడు తను.

ఏదో న్యూనతా భావం తప్పు చేస్తు న్నట్లు. దాన్ని నలుగురు గమనిస్తారని.

లక్ష్మి ఆలోచనలు తనను ఎల్ల ప్పుడూ వెంటాడుతున్నాయి.

ఆమె తన మనసంతా ఆక్రమించింది.

ఆమె తనకు స్వంతమయితే, ఆమెను చూడకుండా వుండగలడా?

అసాధ్య మనిపిస్తోంది.

తను ఆమెతో ఇంతదాకా చెప్పలేక పోయినా....తను మధ్యనున్న వలువసి పొర తెరను చించి........ అహాన్ని, భయాన్ని....సందేహాల్ని ప్రక్కకునెట్టి..

లక్ష్మితో ఆ సంగతి చెప్పేయాలి.

గంటతర్వాత....

తన మనసంతా ఆక్రమించుకొన్న లక్ష్మి వచ్చింది!

మొహంలో ఏదో దిగులు.

గదిలో కొచ్చింది.

అమాంతం ఆమెను ఎత్తుకొని ముద్దు లతో....

"ఒదలండి.... ఛీ........ఒదలండి" తీవ్రంగా ప్రతిఘటించింది. తనను తోసే సింది.

దూరంగా ఉంకమంది.

"రేపట్నించి పనిలోకిరాను"

"ఏం? ఎందుకని?" ఆతృతగా అడి గాను. "వేళాకోళమా?"

"కాదు."

"ఎందుకని?"

"రాజారావొచ్చాడు వెళ్ళిపోతాను."

"గుండె జారిపోయినట్లయింది.

"జీవితాంతం నా దగ్గర ఉండిపో. పోషిస్తాను."

"రాజారావుతో వెళ్ళిపోతాను. లారీ డ్రైవరుగా సంపాదనాపరుడయ్యాడు"

"ఎంత? వాడెంత సంపాదించగలడు? నెలకు రెండువేలు సంపాదించగలడా? సొంత ఇలుకట్టుకోగలడా? మంచిచీరలు కొనగలడా? మంచి తిండి పెట్టగలడా? నాఅంత అందగాడా? చదువుకున్నాడా? నాకంటే వాడితో వుండటంలో ఏం సుఖ పడతావు? నాకంటే వాడెందులోగొప్ప?"

"రాజారావు నామొగుడు. మీరుకాదు. అంతే తేడా. సినిమా కెళితే నాతోనే ప్రక్కనే కూర్చుంటాడు. ఎవరితోనన్నా 'నా పెళ్ళాం' అని చెప్తాడు ధైర్యంగా. అన్నిటికంటే అవే ఎక్కువ నాకు. అందు లోనే ఎక్కువ తృప్తి వుంది నాకు" ★



# మర్డర్

జ్యోత్స్నా ఇలియాస్

సిటీ క్రైమ్ బ్రాంచ్‌లో ఇంటరాగేషన్ రూంలో-రాత్రి 11-30 దాటింది. ఇన్‌స్పెక్టర్ సుదర్శన్ మధ్యాహ్నం మూడు గంటలనుంచీ ప్రయత్నిస్తూనే వున్నాడు. రామశర్మ ఏ ప్రశ్నకీ తొణకకుండా ఓపిగ్గా సమాధానం చెబుతున్నాడు. రేపు పొద్దున్న 11 గంటలకి రామశర్మని కోర్టులో హాజరుపర్చాలి. ప్రాసిక్యూషన్ కేసు బలంగా తయారు చేయలేకపోతే రామశర్మని విడుదల చేయవచ్చు-లేదా జ్యూడిషియల్ కస్టడీలో పెట్టవచ్చు. జ్యూడిషియల్ కస్టడీలో పెడ్తే ఇక రామశర్మనుంచి నిజం కక్కించడం అసలు సాధ్యంకాద.

అందుకే, ఫ్లాస్కులోంచి కాఫీ పోసుకుని, నెమ్మదిగా సిప్ చేస్తూ, మరోసారి తన పని ప్రారంభించాడు ఇన్‌స్పెక్టర్ సుదర్శన్

"మిస్టర్ రామశర్మా మరోసారి ఆలోచించుకోండి. కోర్టులో మీ నేరం నిరూపించడానికి మాదగ్గర కావలసినన్ని ఆధారాలున్నాయి మీరు నేరం ఒప్పేసుకుని, మాతో సహకరిస్తే మీ శిక్ష తగ్గవచ్చు"

రామశర్మకి 35 లేదా 40 సంవత్సరాలుండవచ్చు సన్నగా, పొడుగ్గా వుంటాడు. స్ఫురద్రూపి. ఇన్‌స్పెక్టర్ ఎదురుగా కూర్చున్న అతని మొహంలో

ఎటువంటి భావమూ లేదు. నుదటిమీది నుంచి చెమటలు కారుతున్నాయి; జుట్టు రేగిపోయి వుంది. అయితే అది కేవలం అలసటవల్ల. అతనిస్తున్న సమాధానాల్లో భయంగానీ, ఆందోళనగానీ లేదు. ఒక్కొక్క మాట తూచి తూచి మాట్లాడుతున్నాడు.

"సారీ ఇన్‌స్పెక్టర్, నేను మీతో సహకరించడానికే ప్రయత్నిస్తున్నాను. కానీ మీరు అర్థం పర్థం లేని ప్రశ్నలు వేసి నేను చెయ్యని నేరాన్ని చేసినట్టు ఒప్పుకోమంటున్నారు. కేవలం ఒక అమ్మాయి చెప్పిన మాటలు నమ్మి నన్నిలా నిర్బంధించడం అన్యాయం. మీరు ఎన్ని ప్రశ్నలు వేసి వేధించినా నా సమాధానం ఒక్కటే...."

ఇన్‌స్పెక్టరు అతన్ని వాక్యం పూర్తి చెయ్యనివ్వలేదు.

"అయితే మీ పక్కింట్లో వుండే డాక్టర్ సుందరి చెప్పిందంతా అబద్ధమంటారు-మొన్నరాత్రి ఆమె విన్నదీ, చూసినదీ అంతా ఆమె ఊహ అంటారు?"

"కావచ్చు"

"డాక్టర్ సుందరి చాలా బిజీ డాక్టర్. మీమీద ఆమె ఇలాంటి ఘోరమైన అభాండం ఎందుకు వేస్తుంది?"

"నేను డాక్టర్ సుందరి గురించి ఏమీ మాట్లాడదల్చుకోలేదు. ఆవిడ నాకు ఇలా ఎందుకు రిపోర్టు చేసిందో నాకు కొంతవరకూ తెలుసుననుకోండి-అయినా అది నేనిప్పుడు చెప్పను. నేను చెప్పినా మీరు నమ్మరు"

"చెప్పి చూడండి - నమ్ముతానేమో! మీకూ, డాక్టర్ సుందరికీ శతృత్వం వుందంటారేమిటి?"-వెటకారం చేస్తూ అడిగాడు ఇన్‌స్పెక్టర్.

"లేదు. పైగా మేము ఫ్యామిలీ ఫ్రెండ్స్ కూడాను. ఆవిడ తరచూ మా ఇంటికి వస్తూవుంటుంది. ఆదివారాల్లో క్లినిక్ తెరవదు కాబట్టి పేక ఆడడానికి మా ఇంటికి తప్పనిసరిగా వస్తుంది"

రామశర్మ కొంచెం రిలాక్స్‌డ్‌గా సమాధానం ఇస్తున్నట్టు అనిపించింది ఇన్‌స్పెక్టర్‌కి. ఈ మూడ్‌లోనే వుంచి, అతన్నుంచి నిజం రాబట్టాలి. సానుభూతి చూపిస్తూ మాట్లాడితే ఏమైనా చెప్తాడేమో,

"మరి అంత క్లోజ్ ఫ్రెండ్ ఇలా ఎందుకు రిపోర్టు చేసిందో" రామశర్మ సూటిగా ఇన్‌స్పెక్టర్ కళ్ళల్లోకి చూశాడు. కానేమీ ఏం మాట్లాడలేదు.

"షి ఈజ్ ఎ సైకిక్ కేస్"-అన్నాడు నెమ్మదిగా.

"వాట్-నేను నమ్మను"

రామశర్మ ఏమీ మాట్లాడలేదు. నాకు తెలుసు మీరు నమ్మరని అన్నట్టు చిన్నగా నవ్వాడు.

"సరే మీరన్నట్టు డాక్టర్ సుందరి సైకిక్ కేస్ అనే అనుకుందాం. అందే-ఆవిడ జరగనిది జరిగినట్టు ఊహించుకుని పోలీసు రిపోర్టు ఇచ్చిందని మీ అభిప్రాయం కావచ్చు?"

అవునన్నట్టు తలూపాడు రామశర్మ.

"అయితే మరి మిగతావాళ్ళ సంగతేమిటి?"

"మిగతావాళ్ళా? ఎవరూ? కాప్టన్ రణధీర్, ఆయన సతీమణి-వాళ్ళేగా-వాళ్ళు విన్నామన్న ఆ అరుపులు నేనూ విన్నానని చెప్పానుగా. మా ఇళ్ళ వెనక

వున్న గుడిసెల్లో ఓ రిక్షావాడు తాగివచ్చి తన పెళ్ళాన్ని బాదుతూవుంటాడు. ఆ అరుపులు అవే కావచ్చు. నా మాటలు మీరు పూర్తిగా వినకుండా ఎందుకు నా మీద ఇలాంటి ఆరోపణలు చేస్తున్నారో నాకు తెలీడంలేదు ఇన్స్పెక్టర్. పైగా నేను ఇచ్చిన రిపోర్టుసంగతే మీరు అసలు ప్రస్తావించడంలేదు. సినిమాకని వెళ్ళిన నా భార్య తిరిగి ఇంటికి రాలేదనీ, నా మనస్సు ఏదో కీడును శంకిస్తోందనీ, వెంటనే ఇన్వెస్టిగేషన్ చెయ్యమనీ నిన్న నేను కాచిగూడా పోలీసు స్టేషన్లో రిపోర్టు ఇచ్చాను. ఆ రిపోర్టు పట్టించుకోవడం అటుంచి నేనే సావిత్రిని....."

ఇన్స్పెక్టర్ సుదర్శన్ బలంగా బల్ల మీద గద్దాడు.

"అవును మిస్టర్ రామశర్మా. మొన్న రాత్రి మీ భార్యను చంపారు. చంపి, ఆమె శవాన్ని ఎక్కడో దాచేశారు. ఈ విషయం పోలీసులకి ఎప్పుడో ఒకప్పుడు తెలియకపోదు. అందుకే చాలా తెలివిగా మమ్మల్ని తప్పుదారి పట్టిద్దామని మీ భార్య కనిపించడంలేదని రిపోర్టిచ్చారు. మొన్నరాత్రి మీ ఇంట్లో ఆ చావుకేక ఎవరూ వినకుండా వుంటే, ముఖ్యంగా డాక్టర్ సుందరి ఎఫ్. ఐ. ఆర్. లేక పోతే, మీ మాటలు మేము నమ్మేవాళ్లమే. "యూ ఆర్ ఎ కోల్ బ్లడెడ్ మర్డరర్"

రామశర్మ మొహంలో క్షణం సేపు వికృతమైన కోపం కనబడి అంతలో మాయమైంది. మళ్ళీరామశర్మ మొహంలో మునుపటిలాగే ఎటువంటి భావమూలేదు.

"యూ ఆర్ ఫరోలీ ఇన్ సల్టింగ్ మీ- ప్రేమించి పెళ్ళి చేసుకున్న నా భార్యని నేను చంపానని మీరంటున్నారు మీరు పేర్కొంటున్న సాక్ష్యాలూ ఆధారాలూ ఎంతసిల్లిగా [illegible]యో మీకే తెలుస్తుంది లెండి"

"ఎలా తెలుస్తుందంటారు"-వ్యంగంగా అడిగాడు ఇన్స్పెక్టర్.

"నా భార్య సావిత్రి తిరిగివచ్చినపుడు"

ఇన్స్పెక్టర్ నవ్వాడు

"చని పోయిన వాళ్ళు తిరిగి రారు మిస్టర్. ఆమ్ ష్యూర్ దట్ యూ హావ్ కిల్డ్ హర్. ఇవ్వాళో రేపో ఆమె శవం మాకు దొరక్క పోదు. అపుడు మీ నేర ఋజువవుతుంది-"

రామశర్మ రియాక్షన్ కోసం ఇన్స్పెక్టర్ సుదర్శన్ ఎదురు చూశాడు. కానీ, అతను తన చేతికేసి పరిశీలనగా చూస్తూ, పరధ్యాన్నంగా కూర్చున్నాడు- గదిలో గడియారం చప్పుడు మినహా, అంతా నిశ్శబ్దంగా వుంది, అంతలో గది తలుపు మీద ఎవరో నెమ్మదిగా తట్టారు. ఇన్స్పెక్టర్ చిరాగ్గా మొహం పెట్టుకుని బయటికి వెళ్ళాడు. ఐదునిమిషాలు రామశర్మ ఇంటరాగేషన్ రూమ్లో ఒంటరిగా కూర్చున్నాడు. ఇన్స్పెక్టర్ తిరిగి వచ్చాడు అతని మొహంలో ఇప్పుడు చిరాకు అగుపడటంలేదు. ఎంతో హుషారుగా వున్నాడు.

"మొన్న సాయంత్రం మీ భార్య ఇ ట్లోంచి బయల్దేరి నప్పటి నుంచీ నిన్న మధ్యాహ్నం వరకూ మీరు ఎక్కడికీ వెళ్ళ లేదన్నారు కదూ?"

"అ ...అవును...." మొదటి సారిగా, రామశర్మ తడబడ్డాడు.

"మొన్నరాత్రి 11.20 గంలకు మీరు




కారులో బయటికి వెళ్లారు. అవునా?"

"లేదే"

"ఇంక మీ నటన చాలించండి మిస్టర్ రామశర్మా! ఇప్పుడే నాకందిన సమాచారం ప్రకారం, మీరు మాతో చెప్పిందంతా అబద్ధమని తెలిసి పోయింది. మొన్న రాత్రి 11. 30ని॥లకు-అంటే మీ ఇంట్లోనే చావుకేక వినిపించిన 15ని పాలకు మీరు కారుస్టార్టు చేసుకుని ఎక్కడికో వెళ్లారని డాక్టర్ సుందరి తన స్టేట్‌మెంటులో చెప్పారు, అది అబద్ధమని మీరు చెప్పారు. కానీ అది సెంట్ పర్సెంట్ కరెక్టని తెలిసింది. మీరు ఇంటినుంచి తిన్నగా పెట్రోల్ బంకి వెళ్ళారు-పెట్రోలు పోయించుకున్నారు పెట్రోల్ పోసే కుర్రాడు మిమ్మల్ని గుర్తుపట్టాడు టాంకులో 10 లీటర్లు పెట్రోలుపోయించుకుని మీరు ఎటో వెళ్లారు-ఇప్పుడైనా ఒప్పుకుంటారా?"

కాస్సేపు రామశర్మ మౌనంగాకూర్చున్నాడు. ఏం మాట్లాడలేదు.

క్రమంగా అతని ధోరణి మారిపోయింది.

"సారీ ఇన్‌స్పెక్టర్"-ఎంతో బాధ పడుతున్నట్టుగా అన్నాడు.

"డాక్టర్ సుందరి మాటలన్నిటినీ కాదనడమే మంచిదనిపించి అలా అన్నాను. ఇదొక్కటే నేను చెప్పిన అబద్ధం-రియల్లీ ఇన్‌స్పెక్టర్ మీరే నన్ని గొడవల్లోంచి బయటకు పడెయ్యాలి. నేను సావిత్రిని చంపలేదు. తనేదో గొడవల్లో ఇరుక్కుందేమోనని మొన్న రాత్రి మీరు చెప్పిన టైముకి నేను బయటికి వెళ్ళినమాట నిజమే-పెట్రోలు పోయించు

కుని ఎటు వెళ్ళాలో అర్థంకాక, ఆబిడ్స్ వరకూ ఒక రౌండ్ వెళ్ళి, తిరిగి వచ్చేశాను ఇంటికి వచ్చి, సావిత్రి ఆచూకి తెలుసుకోడానికి తన ఫ్రెండ్ విజయ ఇంటికి ఫోన్ చేశాను కావలిస్తే, మీరు విషయం ఆమెని అడిగి తెల్సుకోవచ్చు ఆతరువాత నేనెక్కడికీ కదల్లేదు నన్ను నమ్మండి ప్లీజ్"

ఇన్స్పెక్టర్ సుదర్శన్ రామశర్మ వైపు కరిసంగా చూస్తున్నాడు.

"ఒక అబద్దాని కప్పి పుచ్చడం కోసం మరో అబద్ధం-? మీరు చాలా తెలివైన వారే కావచ్చు రామశర్మా -కానీ-, పోలీస్ డిపార్టు మెంట్ని మాత్రం బోల్తా కొట్టించలేరు-మీరుకార్లో కేవలం ఆబిడ్స్ వరకే వెళ్ళి వచ్చేశానంటున్నారు-కానీఅది కూడా వచ్చి అబద్ధమే- అంబాసిడర్ కారులో ఆబిడ్స్ వెళ్ళి రావడానికి పది లీటర్ల పెట్రోల్ అవసరమైందా?

"మీరంటోంది ఏమిటి ఇన్స్పెక్టర్?" అయోమయంగా మొహం పెట్టాడు రామశర్మ.

"మిస్టర్ రామశర్మా! ఇప్పుడే మా స్టాఫ్ వెళ్ళి మీ కారు చెక్చేసి వచ్చారు. మీ టాంకులో పెట్రోల్లేదు. అంటే మీరు ఇంటినుంచి దాదాపు 35 కిలో మీటర్లయినా వెళ్ళివచ్చి వుండాలి చెప్పండి ఎక్కడికి వెళ్ళారు"?

"నిజం ఇన్స్పెక్టర్, నేనెక్కడికీ వెళ్ళలేదు. నేను నిజంగా ఎక్కడికీ వెళ్ళలేదు."

"ఇక మీరు నిజం ఒప్పేసుకోండి రామశర్మా! మీచేత నిజం కక్కించడం మాకు కష్టమైనపనికాదు. నేను మీ స్టేట్మెంట్ తీసుకోలేకపోతే, ఇన్స్పెక్టర్ రావ్ మీ ఇంటరాగేషన్ చేస్తారు. నా పద్ధతులకూ ఆయన పద్ధతులకూ చాలా తేడా వుంది. హీ యూజెస్ థర్డ్ డిగ్రీ."

రామశర్మ స్తంభించిపోయాడు.

"ఇన్స్పెక్టర్....నా మీద థర్డ్డిగ్రీ ఉపయోగిస్తారా? అదిచట్టవిరుద్ధం. నన్ను బాధపెట్టి, నేను చేయని నేరాన్ని నన్ను ఒప్పుకోమంటారా?"

"మీలాంటి నరస్తుల విషయంలో ఒక్కసారి అదే సరిఅయిన మార్గం. ఇకనైనా బెట్టుచేయక, నిజం చెప్పేయండి. మీ భార్యశవం ఎక్కడ దాచారు?"

"ఇన్స్పెక్టర్ దాదాపు ఆరేడు గంటల్నుంచీ ఈ ప్రశ్న మీరు కొన్ని వందల సార్లన్నా అడిగివుంటారు. నేను మిమ్మల్నొక ప్రశ్న అడగవచ్చా?" ఇన్స్పెక్టర్ సుదర్శన్ తమాషాగా నవ్వాడు.

"మా పోలీసు వాళ్ళకు ప్రశ్నలు వేయడమే తెలుసు. కానివ్వండి-మీప్రశ్న ఏమిటో అడగండి- విందాం!!

"నేను నా భార్యని చంపాననీ, తన శవాన్ని ఎక్కడో దాచేశాననీ మీరు అనుకుంటున్నారు. ప్రేమించి పెళ్ళిచేసుకున్న నాభార్యని నేనెందుకు చంపుతాను ఇన్స్పెక్టర్? మీ పోలీసు డిపార్ట్మెంట్ వాళ్ళు అన్నిటికంటే ముందు నేరానికి వెనుక కారణంకోసం వెదుకుతారని విన్నాను- అదే మోటివ్ బిహైండ్ ద క్రైమ్ మరి నేను సావిత్రిని ఎందుకు చంపుతాను? ప్లీస్ ఇన్స్పెక్టర్, నన్ను వెళ్ళనివ్వండి-దయచేసి నా భార్య ఎక్కడుందో కనుక్కోండి. తనేదో ఆపదలో చిక్కుకుని వుంటుంది.




"స్టావిట్ ఐసే-మీ మోటివ్ గురించి మా కెటువంటి సందేహం లేదు. ఆమాట కొస్తే, మీరు మా కార... ఎక్కడో-పాతిపెట్టారన్న ... ఎటువంటి అనుమానంలేదు. మా దగ్గిర అన్ని ఆధారాలున్నాయి. అయినా మీరు అడుగుతున్నారు కాబట్టి చెప్తున్నాను—మీరు మీ భార్యని ఆస్తికోసం చంపారు ఇన్స్పెక్టర్ సుదర్శన్ మధ్యలో ఆపేసాడు. తనమాటలు వింటున్న రామశర్మ మళ్ళీ రిలాక్స్ అయిపోయాడు. ఇది ఇన్స్పెక్టర్‌కి అర్థం కాలేదు. తను ఎక్కడో పొరబడుతున్నాడేమో రామశర్మ మొహంలో మళ్ళీ అదే నిర్భయం ఎందుకు?

"యూ ఆర్ రాంగ్ ఇన్స్పెక్టర్. సావిత్రి చావువల్లనాకు ఎటువంటి లాభం వుండదు".

ఎక్కడో ఏదో పొరపాటు జరిగింది. రామశర్మ నేరం చేయలేదేమో నన్న అనుమానం ఇన్స్పెక్టరుకి లేదు. పోతే రామశర్మ ధోరణి తను. లోగడచూసిన నేరస్తుల ధోరణికి భిన్నంగావుంది అతను తనలో ఏదో ఆట ఆడుకుంటున్నాడేమో ననిపిస్తోంది- ఏమిటాఆట?.... మోటివ్... మోటివ్... దాంట్లోనే వుంది తన కరం కానిదేదో....అయినా రామ శర్మ నేరస్థుడు....అందులో సందేహం లేదు

"ఐయామ్ నాట్ రాంగ్....సావిత్రి గారి ఆస్తి కొన్ని లక్షలు విలువచేస్తుంది. అది మీ అబ్బాయికి చెందాలని ఆవిడ వీలునామా రాసింది ఈ విషయం మీకు తెలుసు. అయితే మీ అబ్బాయి మెంటల్లీ రిటార్డెడ్ చిల్డ్రెన్స్‌స్కూల్‌లో వున్నాడు. మీరు మీఅబ్బాయిక గార్డియన్‌మాత్రమే. నిజమే-అయితే మానసికంగా ఎదగని

పిల్లవాడి పేర ఆ స్థిరాస్తి, పవర్ ఆఫ్ అటార్నీ మీ పేరనే ఉందిగా - అంటే ఆ స్థిరాస్తి విక్రయించే హక్కు కూడా మీకుందన్నమాట - సావిత్రిగారి మరణంవల్ల ఎవరికైనా లాభం వస్తుందంటే అది కేవలం మీకే-....ఓ. కే....ఈ విషయాలన్నీ రేపు కోర్టులో చూసుకోవచ్చు. మాకు కావలసిందల్లా మీ స్టేట్ మెంట్.... ఇంతవరకూ మీరు ఒప్పుకున్నమాటలూ. మా దగ్గరున్న సాక్ష్యాలూ చాలు, మీరు నేరస్థులని ఋజువు చెయ్యడానికి.

"ఇన్స్పెక్టర్ .. నేను ఇంత వరకూ చెప్పినదంతా స్టేట్ మెంట్ లా ఇవ్వమంటే తప్పకుండా రాసి సంతకం చేస్తాను" అయితే ఈ స్టేట్ మెంట్ మీద సంతకం పెట్టేముందు మా ఎడ్వకేట్ ని ఒకసారి సంప్రదించవచ్చా?"

"ఎవరూ మీ అడ్వకేట్?" అనుమానంగా అడిగాడు ఇన్స్పెక్టర్

"రంగారావుగారు" అన్నాడు రామశర్మ.

## 2

అడ్వొకేట్ రంగారావు చాలా సీనియర్ అడ్వొకేట్. క్రిమినల్ కేసుల్లో ఆయనను మించిన అడ్వొకేట్ లేడనేది అందరూ ఒప్పుకొనే విషయం. పోలీస్ కంట్రోల్ రూంనుండే రామశర్మ ఆయనతో ఫోన్లో ఏదో మట్లాడాడు, రెండవ రోజు రామశర్మని కోర్టులో హాజరుపరచినపుడు చిపెకెల మీద అతడ్ని జామీను మీద విడిపించాడు-సరి అయిన ఆధారాలు లేనిదే ముఖ్యంగా శవం దొరకనంత వరకూ హత్య జరిగిందడానికి ఎటువంటి నిదర్శనమూ లేదనీ, అంత వరకూ ఎవరినీ నిందించడానికి వీల్లేదనీ ఆయన వాదించారు.

ఆ తరువాత కోర్టులో దాదాపు నెల రోజులు కేసు కొనసాగింది. ఆ నెల రోజుల్లో రామశర్మ వార్తా పత్రికల్లో సావిత్రి ఫోటో ప్రచురించి, ఆచూకీ తెలిపిన వారికి పదివేల రూపాయల బహుమానమిస్తానని ప్రకటించాడు. మరోవైపు పోలీసులు సావిత్రి శవం కోసం రామశర్మ బంగాళా ఆవరణలో, ఊరి పొలిమేరల్లో గాలించి, విఫలు అయ్యారు. సావిత్రి ఎక్కడికి పోయిందో, ఏమైందో ఎవ్వరూ చెప్పలేక పోతున్నారు.

కేసు విచారణకి వచ్చింది. కేప్టెన్ రణధీర్ కోర్టులో సాక్ష్యం ఇచ్చాడు. రంగారావు క్రాస్ ఎగ్జామినేషన్ చేసిన తర్వాత తను ఆరోజు నిన్న కారు లేక రాంశర్మ ఇంటినుంచే వచ్చిందో లేదో ఖచ్చితంగా చెప్పలేనని ఒప్పుకున్నాడు.

తన క్లయింట్ రామశర్మ ఆ రోజు రాత్రి పెట్రోలు పోయించుకున్నమాట వాస్తవమే కానీ అతను ఎంతో దూరం వెళ్ళలేదని రంగారావు వాదించాడు. అయితే పెట్రోల్ టాంకు ఖాళీగా వుండడానికి కారణం ఫ్యూయల్ పంపు ఓవర్ ఫ్లో కావడమేననీ, పోలీస్ కస్టడీలో ఉన్న కారుని మరోసారి పరిశీలించవచ్చునని ఎంతో నేర్పుతో వాదించాడు.

రంగారావు కేసు పట్టాడంటేగానీ, దానికి ఎదురుండదు అందుకే కోర్టులో కేసు విచారణకి వచ్చినపుడల్లా జూనియర్ అడ్వొకేట్లతో కోర్టు హాలు కిక్కిరిసిపోయేది.

పోలీసు కేసు బలం కోల్పోతోంది. సావిత్రి జాడ ఇంకా తెలియలేదు. పోలీ




నులు ఆశించినట్టు హత్య జరిగినట్టు మరే ఆధారమూ దొరకలేదు.

డాక్టర్ సుందరి పేరుకు తగ్గట్టు అందంగా వుంటుంది కోర్టులో తన సాక్ష్యం వున్నప్పుడు కోర్టుహాలు నిండిపోయేది. తను విన్నదీ, చూసినదీ విపులంగా కోర్టులో చెప్పింది రామశర్మకీ సావిత్రికీ తరచు మనస్పర్థలు వస్తుండేవనీ, ఈ విషయం సావిత్రి తనతో చెప్పేదనీ 'నన్ను ఆయన చంపినా చంపేస్తాడు' అని ఒకరోజు సావిత్రి తన ఇంటికొచ్చి బాధపడిందనీ చెప్పింది ఆ రాత్రి 11.30నిముషాలకి రామశర్మ ఇంట్లోంచి ఏవో అరుపులు వినబడి తను బాల్కనీలో వచ్చి నిలబడిందనీ, సావిత్రి చివరిసారిగా అరవడం కూడా తను స్పష్టంగా విన్నదనీ అంది సుందరి. ఆ తరువాత రామశర్మ గారాజ్‌నుండి కారు బయటికి తీసి, డిక్కీ తెరిచిపెట్టి మళ్ళీ ఇంట్లోకి వెళ్లాడనీ, తెల్లటి దుప్పటిలో ఒక శరీరాన్ని భుజంమీద మోసుకొచ్చి డిక్కీలో వేశాడనీ, ఇదంతా చీకట్లో తను అస్పష్టంగా గమనించాననీ వివరించింది.

అడ్వొకేట్ రంగారావ్ డాక్టర్ సుందరిచే ఎలా క్రాసు ఎగ్జామిన్ చేస్తాడోనని అందరూ ఆత్రుతతో ఎదురు చూశారు. కానీ రంగారవు ఆవిడని ఏవో ఒకటి రెండు ప్రశ్నలడిగి వదిలి పెట్టేశాడు. కోర్టులో ఎవరికీ దీని అంతరార్థం బోధపడలేదు.

ఆ మర్నాడు తన ఏకైక సాక్ష్యాన్ని ప్రవేశ పెట్టాడు-సైకియాట్రిస్ట్ మదన్మోహన్!

డాక్టర్‌సుందరి తన పేషెంటనీ, తన దగ్గర సైకో థెరపీ కోసం దాదాపు నెలరోజులుగా వస్తోందనీ, ఆవిడది కలత

నిద్రనీ రాత్రుళ్ళు ఆ విడ ఏవేవో ఊహిస్తూ కూర్చుంటుందనీ, ఆవిడమనో వ్యాధిని 'సింపుల్ స్కిజో ఫ్రెనియా' అంటారనీ అయన తన సాక్ష్యంలో చెప్పారు. ఆవిడ ఊహించే దానికీ, వాస్తవానికీ తేడా ఈ మధ్య గుర్తించడంలేదని కూడా అయన స్పష్టం చేశాడు.

డాక్టర్ సుందరి చేసిన ఆరోపణలు రంగారావు కోర్టులో మరోసారి చదివి వినిపించి, ఇది కూడా డాక్టర్ సుందరి మనోవ్యాధి ప్రతి ఫలమే కావచ్చు కదా అని ప్రశ్నిస్తే సైకియాట్రిస్ట్ మదన్మోహన్ ఒప్పుకున్నాడు.

రెండు నెలలు తిరక్కుండానే, బెనిఫిట్ ఆఫ్ డవుట్ మీద రామశర్మ పైవున్న కేను ఉప సంహరించుకో బడింది.

# 3

బొంబాయి ఎయిర్ పోర్టు దగ్గర సెంటూర్ హోటల్ ముందు టాక్సీ వచ్చి ఆగింది. రామశర్మ చకచకా రిసెప్షన్ కౌంటరు దాటి, లిఫ్ ఎక్కి, 'ఫోర్త్ ఫ్లోర్' అన్నాడు.

మెత్తటి తివాసీ పరిచివున్న కారిడార్‌లో నడుచుకుంటూవెళ్ళి 120వనెంబరు రూం తలుపు తట్టాడు.

'ఎస్?' లోపల్నుంచి ఒక స్త్రీకంఠం.

తలుపు తోసుకుని రాంశర్మ లోపలికి వెళ్ళాడు.

చదువుతున్న మాగజైన్ బెడ్‌మీదే పడేసి డాక్టర్ సుందరి పరిగెత్తుకుంటూ వచ్చి రామశర్మని కౌగలించుకుంది!

"హౌ ఆర్ యూ డియర్?" అన్నాడు రామశర్మ సుందరి మొహం తన అరచేతుల్లోకి సున్నితంగా తీసుకుంటూ—

కాస్సేపు డాక్టర్ సుందరి అతని మొహంలోకే చూస్తూ వుండిపోయింది.

"ఇంకెన్నాళ్ళు రాం?" ..ఆమె కళ్ళలో నీళ్ళతో తిరిగాయి.

"ఇంకొక నెలరోజులు డియర్ — ఆ తరువాత ఆస్తి అంతా అమ్మడానికిపెట్టేస్తాను—ఆ తర్వాత మనిద్దరం బొంబాయిలోనో ఢిల్లీలోనో సెటిల్ అయిపోవచ్చు నా కోసం కొంచెం ఓపిక పట్టలేవూ?"

"మరి హైదరాబాద్‌లో నేనుంటున్న ఇల్లు? దాన్ని గురించి ఏం చేస్తున్నావు రాం?"

సుందరి నడుంచుట్టూ చెయ్యివేసి రూం మధ్యకు నడిపించుకుని వెళ్ళాడు రామశర్మ—

"ఆ విషయాలన్ని నాకు వదిలెయ్ సుందరీ — ఆ ఇల్లు నేను కొనేశాను ఇక దాన్ని గురించి పూర్తిగా మరిచిపో చూడు నేను ఇక్కడ నాలుగైదు రోజులకంటే వుండను. ఇంక ఆ పాత విషయాల గురించి ఆలోచించడం మానెయ్!"

కానీ సుందరి ఎన్నో విషయాలు అడగాలనుకుంటోంది-

"పోలీసులు కేను పూర్తిగా క్లోస్ చేసినట్టేనా?"

"అఫ్‌కోర్స్. నువ్వే నా మీద రిపోర్టు ఇచ్చేసరికి వాళ్ళకి నీ మీద ఏం అనుమానం రాలేదు. ఇంక మీ ఇంట ఆవరణలో వెతకాలని వాళ్ళకి ఎలాతట్టుంది? ఇప్పుడు ఆ ఇల్లు నేను కొనేశాను. మనం తవ్విన ఆ స్థలంలో ఒక చిన్నసర్వెంట్స్ క్వార్టర్స్ కట్టించేస్తాను. ఇక కేనుపూర్తిగా క్లోస్ అయినట్టే కదా? అసలు నువ్వు




డాక్టర్‌వి కావడంవల్ల మనపని మరింత సులువయింది— నా ప్లానింగ్ ఎంత సరిగ్గా వున్నా, నువ్వు సైకియాట్రిస్టు మదన్మోహన్‌ని నీకు నిజంగానే ఏదో ఫోబియా వున్నట్టు నమ్మించ గలిగావు కాబట్టి సరిపోయింది-లేకపోతే మనప్లాన్ మనల్ని ఎక్స్‌పోస్ చేసేది-"

ఆతరువాత వాళ్ళిద్దరూ రెండురోజుల వరకూ ఈ విషయాలేంమాట్లాడుకోలేదు. కొత్తగా పెళ్ళయిన జంటలా వగలంతా షికార్లు సాయంత్రంకాగానే రూంకి చేరు కోవడం-డాక్టర్ సుందరి ఎంతో ఆనం దంగావుంది. కానీ రామశర్మకి దగ్గరయి నప్పుడల్లా ఆమెకి సావిత్రి జ్ఞాపకం వచ్చేది.

రామశర్మ తనని ముద్దెట్టుకుంటుంటే రూంలోఎక్కడో సావిత్రి నిలబడి తమని చూస్తున్నట్లు అనిపించేది! సావిత్రి చని పోయినరోజు జరిగిందంతా, మార్పులతో చేర్పులతో, పీడకలా మనసుని పీడిస్తూం దేది - ఈ విషయాలు రామశర్మ చెప్తే

"డోంట్‌బీ సిల్లీ మైడియర్-సావిత్రిని మరచిపో-తనకు తగినశాస్తే జరిగింది- షి డిసర్వ్‌డ్ ఇట్."

"అలా అనకు రాం. నాకు బావుం డదు."అని అతన్నివారించడానికి ఒకటి రెండుసార్లు సుందరి ప్రయత్నించింది—

"దీంట్లో బా వుం డ క పోవటానికి ఏముంది. మన విషయం తనకు తెలిసి నప్పటినుంచీ మనని వేరు చేయాలనితను ఎన్నివన్నాగాలు వ న్నిం దో నీకేం తెలును?"

రామశర్మ ధోరణి సుందరికి నచ్చ లేదు.

"అందులో తప్పేముంది రాం? పావం తనకి నువ్వంటే ప్రాణం. అందుకే మన సంగతి తెలిసి భరించలేక పోయింది-"

"అక్కడే నువ్వు పొరపడుతున్నావ్ సుందరి. సావిత్రి నన్నెపుడూ ప్రేమించ లేదు-నన్నొక పనివాడిలా చూసేది-తన

డబ్బుబిల్లి గవ్వ కూడా నన్ను ముట్టు కోనిచ్చేదికాదు. ఆరోజు...ఆరోజు గుర్తుందిగా నాకు? మీ ఇంట్లో మనిద్దరం ఒంటరిగా వున్నపుడు బెడ్ రూం తలుపు తీసుకుని లోపలికి వచ్చేసిందికదా- ఆ రోజున ఏం చెప్పింది? తను రాసిచ్చిన పవర్ ఆఫ్ అంటార్నీ తీసేసుకుంటాననీ, వెంటనే విడాకులకి కోర్టుకెళతానని బెదిరించలేదూ?"

"అవును రాం, ఆరోజునే నువ్వు విడాకులకి ఒప్పుకొని వుండాల్సింది. అప్పుడీ గొడవలన్నీ వుండేవికాదు కదా? విడాకులకు తనెలాగూ సిద్ధపడింది కదా?"

రామశర్మ మొహం చికాగ్గా పెట్టాడు. 'తన మాటలు నమ్మించేదెవరు? విడాకుల కేసు కోర్టులో పడేసి, ఏదీ తేల్చకుండా ఎన్నేళ్ళయినా గడిపేది..అయినాసుందరీ, ఇవాళ నీకేమైంది? అంతా సవ్యంగానే జరిగి పోయిందికదా? సావిత్రిని చంపింది నేను. నాకులేని గిల్టీ ఫీలింగ్ నీకెందుకు? ఇదంతా నీకోసమే చేశాను. నీకోసం నేనంత రిస్క్ తీసుకున్నందుకు నీకు గర్వంగాలేదూ?"

సుందరికి ఈ మాటలేం సంతృప్తికరంగా లేవు.

"రాం! మన పెళ్ళిసంగతేమిటి?"

రామశర్మ కాస్సేపు ఏమీ మాట్లాడలేదు. మంచంమీద గిరగిరాతిరుగుతున్న ఫాన్‌కేసి చూస్తూ పడుకున్నాడు.

"ఆ సంగతి నీతో మాట్లాడాలనే అనుకుంటున్నాను సుందరీ-

మనిద్దరం పెళ్ళిచేసుకోకుండాఇలాగే వుండిపోవడం మంచిదేమో! అహం..నువ్వే ఆలోచించు - ఇన్ని గొడవలయిన తరువాత, ఉన్నట్టుండి మనంపెళ్ళిచేసుకుంటే ఎవరికైనా పరిస్థితి అర్థమయిపోతుంది."

సుందరి చటుక్కున లేచికూర్చుంది. "అంటే మనం పెళ్ళిచేసుకోమా? ఎప్పటికీ ఇలాగే వుండిపోతామా? ఏమిటి రాం. సరిగ్గాచెప్పు? మనిద్దరం బొంబాయిలోనో ఢిల్లీలోనో సెటిల్ కావచ్చునన్నావు-దాని సంగతేమిటి మరి?"

"చూడు సుందరీ! నేను చెప్పేది పూర్తిగా వినిపించుకో బొంబాయిలోనో ఢిల్లీలోనో నీకో మంచి ఫ్లాట్ కొనిస్తాను. నీకు ఏలోటూరానీను. నేను నెలకి ఒకటి రెండుసార్లు ఇలాగే వస్తూ - పోతూ ఉంటాను."

"యూ వాంట్ మీ టు బి యువర్ కీప్?"

"పెద్దపెద్ద మాటలు మన కెందుకు సుందరీ? నాకు నువ్వు కావాలి నీకునేనూ, అది చాలదా? పెళ్ళి చేసుకుంటేనేగానీ మన ప్రేమ నిలబడదా చెప్పు? పైగా, పెళ్ళిచేసుకుంటే మనం ఆలోచించే పద్ధతిలో మార్పు వస్తుంది. మన వ్యక్తిత్వం పోతుంది. నీకీ విషయాన్ని అర్థమవుతాయనుకున్నానే!"

సుందరి శూన్యంలోకి చూస్తూ అడిగింది- "రాం! అయితే మన పెళ్ళి కుదరదా?"

"మనిద్దరికీ అదే మంచిది సుందరీ"

"మరి...మరి , మనకిపుట్టబోయేపాప సంగతేమిటి?"

"వ్హాట్?".... కాస్సేపు రామశర్మ ఆగిపోయాడు. అతనికి ఇంతవరకూ ఈ సంగతి తెలియదు. "నువ్వు డాక్టరువి అయివుండి ఇదెలా జరిగింది? ముందు

# జవజీవాలొలికే పళ్ళిక మీవి!

**బినాకా ఫ్లోరైడ్‌తో పళ్ళను జీవితాంతం సంరక్షించుకోండి.**

బినాకా ఫ్లోరైడ్‌లో, అత్యంత ప్రభావం గల ఫ్లోరైడ్ కాంపౌండ్ ఉంది. అది పళ్ళయొక్క ఎనామెల్‌తో కలిసి, మీ పళ్ళను మరింత గట్టిగా చేస్తుంది.

జీవితాంతం, పళ్ళు పిప్పి పళ్ళు కాకుండా నిరోధించడానికి ఈ సంరక్షణ అవసరం. ఎప్పుడూ బినాకా ఫ్లోరైడ్‌తో బ్రష్ చెయ్యండి. దీన్ని మీరెంత ఎక్కువ కాలం వాడితే, అంత ఎక్కువ కాలం మీ పళ్ళు జవజీవాలతో ఉంటాయి.

**గట్టి పళ్ళకోసం,**
**పిప్పి పళ్ళు రాకుండా నిరోధించడంకోసం.**




# బినాకా ఫ్లోరైడ్

**అగ్రశ్రేణికి చెందిన భారతదేశపు, ప్రభావంగల మొట్టమొదటి ఫ్లోరైడ్ టూత్‌పేస్ట్**

## బంధముక్తి

కల
కల్పవృక్షంగా ఎదిగి
పుప్పొడి చినుకుల దుప్పటిలో
పూలను దాచుకొన్న చోట
నేనూ-ఓ పువ్వునై....

సాంధ్యశ్రీ

జాగ్రత్త పడలేవా? ప్రాక్టికల్‌గా ఆలోచించలేవెందుకు సుందరీ నువ్వు '

"జీవితంలో అన్ని ప్రాక్టికల్‌గానే ఆలోచించాలా రాం? సెంటిమెంట్ లేదా"

"సెంటిమెంట్.. మై ఫుట్...వెంటనే అబార్షన్ చేయించుకో"

సుందరి నవ్వేసింది-చాలా నీరసంగా కళాహీనంగా వుంది సుందరి ముఖం. కళ్లు నిర్జీవంగా వున్నాయి.

"రాం! నేను అబార్షన్‌చేయించుకోను. ఇది నా సమస్య. నాకే వదిలేయ్. చూడు రేపు నువ్వెళ్ళిపోతావు. ఇవ్వాళ నాతో హాయిగా గడుపు. ఈ రాత్రి నాకు జీవితాంతం గుర్తుండేలా చేయి"

రామశర్మ రిలాక్స్ అయిపోయాడు, సుందరిని తన కౌగిట్లో బంధించాడు.

"రాం ప్లీజ్! నన్నింకా దగ్గరికితీసుకో నువ్వు నా కెప్పుడూ, నా ప్రియుడిగా. నా రాంగానే గుర్తుండాలి ప్లీజ్!" రామశర్మ సుందరి కన్నీ[illegible] పెదాలతో తుడిచేశాడు.

రాత్రి పన్నెండు దాటింది. రామశర్మ అలసిపోయి నిద్రపోతున్నాడు. అతని చేయి సుందరి నడుంచుట్టూ పెనవేసుకుని వుంది - సుందరి మెళకువగానే వుంది - ఆమె ఏడుస్తోంది-నెమ్మదిగా రామశర్మ చెయ్యి తన నడుంమీంచి తొలగించి, మంచం మీదనించి లేచింది. నైటీ వేసుకుని తన సూట్‌కేస్‌తెరిచి, అందులోంచి గార్డినాల్ మాత్రల సీసా తీసింది— బాత్రూంలోకి వెళ్ళి, సోప్‌కేస్‌తో ఆ మాత్రలు మెత్తగా పొడిచేసింది మంచం పక్కన స్టూలుమీద వున్న పాలగ్లాసులో ఆ పొడి కలిపింది.

"రాం! మృదువుగా రామశర్మ వీపు నిమురుతూ పిలిచింది."

"ఊఁ''"

"లే! పాలుతాగి పడుకో"

రామశర్మకు రాత్రి పాలు తాగడం అలవాటు.

"నువ్వింకా పడుకోలేదూ?" అంటూ లేచి కూర్చుని గ్లాసులోని పాలు సగం తాగి, మిగతాది సుందరికిచ్చాడు.

"థాంక్స్ డియర్"-సుందరి మిగతా పాలు తాగేసింది''

కాస్సేపుఆగి "రాం-నిద్రపోయావా"

"ఊహూఁ..ఏమిటి?..." కళ్లుమూసుకొనే అడిగాడు.

"డూ యూ లవ్ మీ?"

"..............."

"ఐ లవ్ యూ డియర్. అందుకే సెంటిమెంటుకి స్వస్తిచెప్పి నేను కూడా ప్రాక్టికల్ మనిషిని అయ్యాను"

ఈమాటలు రామశర్మకు వినబడాయో లేదో!

కాస్సేపట్లోనే, సుందరికూడా నిద్రపోయింది శాశ్వతంగా. ★

# పునర్జన్మ

మూలం: శ్రీనివాస్ రాయప్రోల్
అనువాదం: నెల్లూరి కేశవస్వామి

టెలిఫోన్ మోతకు మెలుకువొచ్చింది కమలకు. గోడ గడియారం కేసి చూసింది. పావు తక్కువ ఏడు. రాత్రి రెండింటి దాకా నిద్రపట్టలేదు.

చిరాగ్గా లేచింది. కాళ్ళీడ్చు కుంటూ హాల్లో కెళ్ళింది. ఫోన్ దగ్గరికి.

"హెలో! 33457...."

"——...."

"సారీ, డాక్టర్ కుమార్ లేరు ...మీరు మరో డాక్టర్ని చూసుకోవాలి"

"......"

"అవును, ఇదే ఇల్లు. కాని లేరు... చూడండి, ఆయన ఇక లేరు...కొద్ది రోజుల క్రితమే చనిపోయారు.."

అవతలి మనిషి ఏమంటున్నాడో వినేస్థితిలో లేదు. రిసీవర్ పెట్టేసింది..

అవును, కొన్నాళ్ళ క్రితం వరకూ ఆయన బ్రతికే వున్నారు. ఆరోగ్యంగా వున్నారు. కాని, మృత్యువుకు క్షణంచాలు కను రెప్పపాటులో జీవితాల్ని తల్ల క్రిందులు చేసేస్తుంది. ముఖ్యంగా తన లాంటి యవ్వనవతిని, ఇంకా ముప్పై కూడా నిండని...ఓహ్! ఏమనుకుని ఏం లాభం? ఎవర్ని మాత్రం నిందించి ఏం లాభం? ఆ అవతలి మనిషికి అర్థమవు తుందా?..అలాంటి దుర్ఘటనలు కోకొల్లలు ఈరోజుల్లో. రోజూ పేపర్లో పడుతూనే వుంటాయి.

ఆరోజు తానూ నమ్మలేక పోయింది ఫోనో ఆ దుర్వార్త విన్నప్పుడు హాస్పిటల్ కి పరుగుతీసి, రక్తసిక్తమైన విజయ్ మొహం చూసేదాకా గ్రహింపు కలగనే లేదు-తనకిక భర్త లేడని.

ఆ దుర్దినమంతా మత్తులోలాగే గడిచి పోయింది. స్కూలుకెళ్ళి పిల్లల్ని, వాళ్ళ కేమీ తెలీనివ్వకుండా, లాక్కురావటమూ పొరిగింటిలో వాళ్ళని అప్పజెప్పటమూ, ఆ తర్వాత హాస్పిటల్, పోలీసు అధికార్లతో సతమతమవుతూ తతంగమంతా జరిపించటమూ, అంతా..,అంతా ఒక పీడ కలలా గడిచి పోయింది..,తనకే గనక ఆప్తులెవరైనా వుండే కావిలించుకుని

బావురు మనాలని తహ తహ లాడింది మనస్సు కాని లేరు. తానెప్పుడూ ఆత్మ ధైర్యంమీదే ఆధారపడి ధీమాగా బ్రతి కింది. ఏనాడై ఇతర ఆధారాల అవ సరం కలుగుతుందని కలలో కూడా అనుకోలేదు ..ఇప్పుడు తన బాధ తానే మింగు కోవాలి, ఇతర్లతో పంచుకోటా నికి లేదు, ..చనిపోయింది విజయ్ కాదేమో, తానేనేమో అనిపించింది కమ లకు.

ఆరాత్రి ఎంతో పొద్దుపోయాక తిరి గొచ్చి పక్క మీద పడిపోగానే, భరించ రాని నిశ్శబ్దం, ఒంటరితనం ఆవరించు కున్నాయి. రెండు నిద్రమాత్రలు మింగి కలత నిద్రలోకి జారుకుంది.

రెండోరోజు ఉదయం, సూర్య రశ్మితో బాటు యదార్థ పరిస్థితి కూడా ఎదురైంది ...ఏం చెయ్యాలి? తానిప్పుడు ఏం చేయాలి? ఎలా బ్రతకాలి? పిల్లల్ని ఎన్నాళ్ళపాటు మభ్య పెట్టాలి? తాను.... కొన్నాళ్ళ క్రితం వరకు ఆనంద డోలి కల్లో ఓలలాడుతున్న తాను........

కాలేజీ జ్ఞాపక మొచ్చింది అంద గత్తె, మేధావి అని పేరు సంపాదించింది. ఆటపాటల్లోనూ, చదువులోనూ తనదే పై చెయ్యనిపించుకుంది. ఆఖరికి విజ య్‌తో పెళ్ళైనప్పుడు, కన్నెపిల్లలు కనే కలలన్నీ తనయెడల నిజమైనట్టు మురిసి పోయింది...వాళ్ళది ఆదర్శజంట. పిల్లలు పుట్టక పూర్వం, ఒక సంవత్సరం "మేడ్‌ఫర్ ఈచ్ అదర్" జంటల పోటీలో పాల్గొని నెగ్గారు. ఆ ఫోటో ఇంకా డ్రాయింగ్ రూంలో ప్రత్యేక స్థానం అలంకరించి వుంది. పోటీలో తాము గెలుచుకున్న అరుణకాంతి కారుని ఆనుకుని సగర్వంగా నిలుచుని వున్నాడు అందగాడు విజయ్! ఒక చెయ్యి స్టీరింగ్‌మీద వుంది, రెండో చేతి వేళ్ళలో అతనెప్పుడూ తాగని 'విల్స్' సిగరెట్టు! అదొక పెద్ద జోక్! జ్ఞాపకం రాగానే నవ్వొచ్చింది. కాని వెనువెంటనే అశ్రుధారా ఉబికి వచ్చింది. ఇన్నాళ్ళూ తన ఎదలో అణచుకున్న బాధ అంతా కన్నీటి ధారగా ప్రవహించింది.

కాలం ఆగదు. రోజులు గడుస్తూనే వున్నాయి. మెల్లిగా, భారంగా గడుస్తూనే వున్నాయి. ఇంటి వ్యవహారాలు చక్క బెట్టటంలోనూ, ఇన్సూరెన్స్ ఫారాలు నింపటంలోనూ, ఉత్తరాలకు జవాబులు రాయటంలోనూ గడిచిపోతున్నాయి..... మెల్లిగా, మెల మెల్లిగా, విధవగా, విధవ రాలిగా, నూతనజీవిత పాఠాల్ని నేర్చుకొంటోంది. కారుఅమ్మేసింది. తాను ఇంకా కారులో తిరుగతోందే లోకులు ఏమనుకుంటారో నన్న భయంకొద్దీ, తనకు కష్టంలేకున్నా అమ్మేసింది. పిల్లల్ని బోర్డింగ్‌లో చేర్పించింది. కొద్దిరోజులకు మాత్రమేననీ, డాడీ బిజినెస్ మీద పై వూళ్ళకు వెళ్ళారనీ, తానూ ఆయన్ను అనుసరించాలనీ, పిల్లలకు నచ్చజెప్పింది. కానీ తీరా వీడ్కోలు సమయాన యమ యాతన అనుభవించింది. పాపం! రాజాకు ఆరు సంవత్సరాలు, దీపకు మూడే. కాని గత్యంతరంలేదు. కొన్నాళ్ల పాటైనా తాను ఒంటరిగా వుండేగాని మళ్ళీ మామూలు మనిషిని కాలేనేమోనని పించింది.... కాని, నిజంగా ఏనాటికైనా తాను మళ్ళీ మామూలు మనిషి కాగలదా?

ఏమో ....ఎందుకలా జరిగింది?........ ఎందుకు?...ఎందుకు? తనకే ఎందుకలా జరగాలి?..

కమల అక్కయ్య సావిత్రి బొంబా యిలో వుంటుంది. తనకంటే పదిహే నేళ్ళు పెద్ద. పెళ్ళయ్యాక ఆట్టే కలుసుకో టాలు లేవు. ఆమె భర్త ఇంజనీరు. పెద్ద కుటుంబం. కంపెనీ వాళ్ళు ఇచ్చిన ఇల్లు, తనకిప్పుడు అదే ఆశ్రయం. అక్కకు రాసింది నచ్చి కొన్నాళ్ళపాటు వుంటా నని సావిత్రి జవాబు అంత ప్రోత్సాహ కరంగా లేదు; కానీ రమ్మంది

పై ఆదివారం చిన్న సూటు కేసుతో సహా, దాదర్ రైల్వేపాటు ఫారం మీద కాలు పెట్టింది కమల. అక్క కోసం కలియ చూసింది-కానీ సావిత్రి కనిపించ లేదు, ఆమె భర్త వచ్చారు. కొంచెం జంకుతూనే ఒకర్నొకరు పోల్చుకోగలి గారు.

దారిలో అతనన్నాడు, "కమలా! విజయ్ విషయం విని చాలా బాధ కలి గిందమ్మా. పాపం, పిల్లలకెంతో షాక్ తగిలింది...."

"వాళ్ళకింకా తెలీదు బావా! వాళ్ళ నాన్న బిజినెస్‌మీద వెళ్ళారని చెప్పాను. బోర్డింగ్‌లో వున్నారు. వాళ్ళకెలా తెలియ జెయ్యాలో బోధపడకుండా వుంది.''

"బాధ పడకమ్మా. మేమున్నాంగా? నీ కిష్టం వచ్చినన్నాళ్ళు ఇక్కడుండు.... ఆ,ఒక్కటి ఇక్కడ నీ పనులన్నీ నువ్వే చూసుకోవాలి మీ అక్కయ్య స్కూల్లో పని చేస్తోంది. ఆట్టే తీరిక ఉండదు"

ఇల్లు నిరాడంబరంగా వుంది. కాని గదులు విశాలంగానే వున్నాయి. వెనుక వరండా నించి సముద్రం స్పష్టంగా కని పిస్తుంది. కమలకు ప్రత్యేకంగా గది దొరకలేదు. పెద్దపిల్లల గదిలోనే ఆమెకూ సర్దారు. అబ్బాయికి పదహారు సంవత్స రాలు, అమ్మాయికి పద్నాలుగు. మరో ముగ్గురు చిన్న పిల్లలున్నారు; వాళ్ళు తలి దండ్రుల గదిలోనే పడుకుంటారు.

ఆ రోజు ఆదివారం. ఇంటికెళ్ళేసరికి భోజనాలు టైం అయింది. అందరూ ఇంటి దగ్గిరే వున్నారు. క్షణం సేపు గిగ్గలువడిపోయింది కమల, ఈ వాతా వరణలో తాను కోరుకున్న ఏకాంతం లభిస్తుందా అని. పిల్లలు, ఒక కుక్క టైగర్, కూడా వుంది అదీ అదే గదిలో పడుకుంటుంది.

సావిత్రి వంటగదిలోంచి బయటికొచ్చి ఆప్యాయంగా చెల్లెల్ని కౌగలించుకుంది. పిల్లలు ఒకరి మొహాలు ఒకరు చూసు కుంటూ నిల్చున్నారు. ఆమె తన దగ్గరి కొచ్చినప్పుడల్లా మొరుగుతోంది టైగర్.

భోజనాలైపోగానే పిల్లలంతా తలో వైపుకు మాయమయ్యారు సావిత్రి తనకు గది చూపించింది. వస్తువులు సర్దుకోవ టంలో సహాయంచేసింది.

"ప్రయాణంలో బాగా అలసిపోయి వుంటావు".

"అబ్బే, లేదక్కా! ఏమంత అలసి పోలేదు. ఆం ఆదివారం సాయంత్రాలు మీకు ప్రోగ్రాం ఏదైనా వుంటుందా?"

"ఉంటుంది. ఓ గంటసేపు మఠాని కెళ్ళొస్తాము. అక్కడ స్వామీజీ ప్రవచనం గిస్తారు. భజనకూడా జరుగుతుంది...... నువ్వొస్తావా?''

కమలకు అంతగా నచ్చలేదు. ఆమె ఆధ్యాత్మిక బోధనలవేపు మొగ్గే మనిషి ఏనాడూ కాదు భర్త బ్రతికుండగా, శని వారాలు క్లబ్బుకెళ్ళేవారు, ఆదివారాలు పిక్చర్‌కెళ్ళేవాళ్ళు...కానీ, మొదటి రోజే ఆ ఇంట్లో ఒంటరిగా ఉండటం ఎలా? అందులో ఆ టైగర్ మొరుగురొకటి!

"సరే అక్కా! నేను వస్తాను" అన్నది.

మఠం క్రిక్కిరిసిపోయింది హాలంతా నిండిపోయి, వరండాలో, మెట్లపైనేకాక బయట ఆవరణలో కూడావున్నారు జనం. ఆరోజు కొద్దిగా ఉక్కగా వుంది; చెమటలు కూడాపోస్తున్నాయి. వాళ్ళకు వరండాలో ఓ మూలస్థలంచిక్కింది. నేలపైనే కూచున్నారు.

అప్పటికే స్వామీజీ అభిభాషణ ఆరంభమైంది. కఠోపనిషత్తు సూత్రాల్ని విశదీకరిస్తున్నారు. కంఠం వింటూంటే, స్వామీజీపోడుముకు అలవాటుపడ్డవారిలా అనిపిస్తోంది; అక్కడక్కడ మళయాళపు యాసకూడా పొడచూపుతోంది.

కమల కూచున్నస్థలంనుంచి స్వామీజీ ముఖం కనిపించటంలేదు. తలపైభాగాన వెండిరేకుల్లాంటి కొద్దిపాటి వెంట్రుకలు మాత్రం వెలిగిపోతున్నాయి.

చుట్టూ కలయ చూసింది కమల. అన్ని ప్రాయాలవారూ వున్నారు. కాని ఎక్కువశాతం వృద్ధులే; వృద్ధ జంటలూ, వృద్ధ పూర్వసువాసినులూ, బెల్ బాటం వేసుకున్న కొందరు అమ్మాయిలూ, కొందరు చిన్న పిల్లలు కూడా వున్నారు.. అందరూ మామూలు మనుషులే – ఎవరి మొహంలోనూ ప్రత్యేకత లేదు....

వాళ్ళంతా ఎందుకొచ్చినట్లు? అనుకుంది. స్వామీజీ జ్ఞాన ప్రవచనాల నుంచి వీళ్లు ఏమైనాపొందగలుగుతున్నారా? అదమా ఇరుకుజీవితాల్లో ఇరుక్కుపోయిన గృహస్థుల్లాగే వున్నారు. వదరుబోతు ఆడంగులూ, ఈతిబాధల్లో నిండా మునిగి, పగటి కలలుకనే పురుషులూ, పాలిపోయిన మొహాలుగల పిల్లలూ.. మరి తాను మాత్రం ఎందుకొచ్చినట్టూ? ఒంటరితనాన్ని భరించలేకే కదూ?

సరిగ్గా పదింటికి స్వామీజీ ప్రసంగం ముగిసింది. ఒక్కొక్కరే లేచి వెళ్ళిపోతున్నారు. కొద్దిసేపట్లో హాలు ఖాళీ అయింది, ముందు వరసల్లో కూచున్న కొద్దిమంది తప్ప.

"మనం భజనకూడా వుందాం. బావుంటుంది" అన్నది సావిత్రి.

వెళ్ళి హాల్లో ఓ ఫ్యానుకింద కూచున్నారు. భజన అంటే అందరూ కలిసి పాడటమూ, తాళం వెయ్యటమూ కాకూడదు బాబూ అని ఆశించింది కమల. అలా చెయ్యటం ఎంత కృత్రిమంగా వుంటుందో! భజనమొదలైంది, మొదట్లో విలంబనంగానూ, రానురాను ధృతంగానూ ఆదేదో అర్థంకాని భాష; బహుశ బెంగాలీ కావచ్చు. హార్మోనియం వాయించే కుర్రాడిది మొద్దబారిన మొహం; గొంతు మాత్రం గంభీరంగా వుంది కొందరు భక్తులు కూడా భజనలో పాల్గొనటం మొదలెట్టారు. కాని హార్మోనియం తాళాల శబ్దాలతోనే హాలు మారుమ్రోగుతోంది.

కమలకేదో మైకం కమ్మినట్లనిపించింది. చుట్టూ చూసింది. అందరి పరిస్థితి అలాగే వున్నట్టున్నది. ఎవరి




ధ్యానంలో వారున్నారు.

ఎదుట తయాస్ మీద ఒక మూలకు కూచుని వున్న స్వామీజీ కనిపించారు. కళ్లు మూతపడి వున్నాయి. రాగిరేకుతో చెక్కినట్లున్న ముఖారవిందం కొట్టొచ్చి నట్టుగా వుంది. పైకి తేలిన ఎముకలు అంతర్లీనమైన మృదుత్వాన్ని కప్పి పుచ్చి నట్టుగా వున్నాయి. ఎన్నేళ్ళ క్రితమో తాను "లైఫ్" పత్రికలో చూసిన 'కార్ష్' చిత్రం 'సైబీలియన్' గుర్తు కొచ్చింది. ఆ ముఖ వర్చస్సునే తదేకంగా చూస్తూ కూచుండి పోయింది. మెల్లి మెల్లిగా కళ్ళల్లో చీకటు కమ్ముకొచ్చాయి.

"లే, కమలా! లే" అంటూ కుదుపు తోంది సావిత్రి, "అందుకే అన్నాను. ఇంట్లోనే వుండి విశ్రాంతి తీసుకోమని"

"ఓ, ఫరవాలేదక్కా!" అంది ఇబ్బం దిగా నవ్వుతూ; "వెళ్ళిపోదామా?"

"ఇంకొంచెం ఆగు. స్వామీజీని దర్శించుకుని, ఆయన ఆశీస్సులను అందుకుని వెళ్దాం" అంటూ దారితీసింది సావిత్రి.

హాల్లోంచి బయటికొచ్చి, అందరూ ఒక వేపుకు వెళ్తున్నారు, అక్కడొక కుర్చీ మీద సుఖాసీనులై వున్నారు స్వామీజీ. గంభీర మందస్మిత వదనంతో ఒక్కొక్కరే వెళ్ళి పాదాభివందనం చేస్తున్నారు. ఆయన ఒకటి రెండు మాట లేవో చెబుతున్నారు.

సావిత్రి వాళ్ళ వంతు వచ్చింది. ఆమె, ఆమె భర్త స్వామీజీ కాళ్ళకు మొక్కారు. కమల అలా చెయ్యలేక పోయింది. చేతులు జోడించి నమస్కారం చేసి పక్కనే నిలుచుంది.

సావిత్రి పరిచయం చేసింది! "స్వామీజీ! ఈమె నా చెల్లెలు, కమల, హైద్రాబాదు."

"ఓహో! కొత్తవాళ్ళని చూస్తే నాకు ఆనందంగా వుంటుంది...నువ్వు మళ్ళీ

## ఆణిముత్యాలు

ఎముకల కారాగారంలో
యావజ్జీవ శిక్షను
అనుభవించే ఈ గుండె-
సుషుప్తి చెరువులో
స్వప్నాల చేపలను
వేటాడే గాలాలు... కళ్ళు-
రక్తమాంసాల పంజరంలో
రాగద్వేషాలను ఆలపించే
రామచిలుక....హృదయం-
శిథిల హృదయ సమాధి పగుళ్ళలో
మొలచి....నిక్కి నిక్కి చూసే
పిచ్చిమొక్కలు... అనుభవాలు-
కాలం కాబూలీవాడికి
కంతులమేర కళ్ళు చెల్లించే
పాత ఋణాలు....అశ్రుకణాలు-

వీరపల్లె వీణావాణి

వస్తావుకదూ?" అన్నారు స్వామీజీ కమల నుద్దేశించి.

తనకు ఏంచెప్పాలో తోచలేదు. కాని సావిత్రి అందుకుంది. "స్వామీజీ! నా చెల్లెలు ఈ మధ్యనే భర్తను కోల్పోయింది. ఒక యాక్సిడెంట్‌లో చనిపోయారు. దాన్నించి ఇంకా తేరుకోలేదు."

"అయ్యోపాపం! ఇంతచిన్న వయస్సులోనా...?" స్వామీజీ తేనెపలుకులు శ్రవణానందకరంగా వున్నాయి.

"థాంక్యూ స్వామీజీ" అని మాత్రం అనగలిగింది. ఆయనకళ్ళల్లోకి సూటిగా చూస్తూ. అక్కడ్నించి ఏదో దయామయ దివ్య తేజస్సు వెలువడి తన హృదయాంతరాళాల్లోకి సూటిగా దూసుకుపోయినట్టు అనుభూతి పొందింది. కారు మబ్బులన్నీ విచ్ఛిన్నమై పోయినట్టనిపించింది. మనస్సులోని భారమంతా తొలగిపోయి తేలిక పడ్డట్టు ఫీలయింది.

దారిలో బావ అన్నాడు. "కమలా నీకు బోర్ కొట్టలేదుకదా? మాకైతే ప్రతి ఆదివారం రావటం అలవాటే..సావిత్రితో నిన్ను తీసుకురావద్దనే అన్నాను. కాని ఇంటో ఒంటరిగా, అదీ మొదటిరోజే, వదల్లేక పించుకొచ్చింది"

"ఫరవాలేదు బావా! నాకేంబోరు కొట్టలేదు కాని, నేనెప్పుడూ ఏ స్వామీజీని చూడ్లేదు. ఆయనా మనలాగే వున్నారు."

కాని రాత్రికి నిద్ర హరించుకుపోయింది, అశాంతిగా అటూ ఇటూ దొర్లుతూనే సరిపోయింది వరండాలోకి వెళ్ళింది. చీకట్లో గర్జిస్తూన్న సముద్రుడికేసి చూసింది. అల్లంత దూరాన క్వీన్స్ నెక్లెస్ (దీపాలతోరణం) కలర్‌ఫోటోలా మెరుస్తోంది. చప్పున విజయ్ జ్ఞాపకం వొచ్చాడు, హృదయమంతా విషాదపూరితమైన శూన్యంతో నిండిపోయింది. కాని ఇప్పుడే చెయ్యాలి? ఎలా బ్రతకాలి? స్వామీజీ మాటలు స్ఫురణకొచ్చాయి. 'ఇంతచిన్న వయస్సులోనా...?'...

రెండో రోజు నీరసంగా లేచింది. తొమ్మిదయ్యేసరికి బావా, పిల్లలూ వెళ్ళిపోయారు. తొమ్మిదిన్నరకు సావిత్రి అన్నది' "సారీ కమలా నేనూ ఇక వెళ్ళాలి. సాయంత్రం నాలుగింటికి

టాప్ స్టార్ ఉన్న
కప్పు ఏది ?



చూడండి, ఇక్కడ
చిక్కని, కమ్మని టీ ఉన్నది

500 గ్రా.,
250 గ్రా.,
100 గ్రా.లలో
దొరుకుతుంది.

చూడగానే తెలుసుకుంటారు దాని గొప్పదనం
రుచిచూడగానే గ్రహిస్తారు దాని కమ్మదనం

చిక్కదనపు పరీక్షలో లిప్టన్ టాప్‌స్టార్‌దే గెలుపు. చూడగానే తెలుస్తుంది దానిలోని ప్రత్యేకత. తాగగానే తెలుస్తుంది దానిలోని ఘాటైన రుచి.

# లిప్టన్ టాప్ స్టార్ టీ




చిక్కదనంలో టాప్, కమ్మదనంలో టాప్

LIPTON

NOV '82

వస్తాను. తక్కిన వాళ్లు ఆ తర్వాతే వస్తారు. నువ్వు ఇంట్లోనే వుంటావా లేక సినిమాకిగానీ, ఇంకెక్కడికైనా వెళ్తావా?"

ఇంటిదగ్గరే వుండటానికి నిశ్చయించుకుంది కమల. సమయం ఎంతో కొద్దిగా సాగుతోంది. ఒక పుస్తకం అందుకుంది చదవాలని కాని మనసు పరి పరి విధాల పోయింది. కొంచెంసేపు పైగర్‌ను మచ్చిక చేసుకోటానికి ప్రయత్నం చేసింది. కాని అందరూ వెళ్ళి పోయాక దానికీ ఉత్సాహం చచ్చి పోయిందేమో, తన మూల కెళ్ళి పడుకుంది....రికార్డు పెట్టింది, విజయ్‌కు ప్రీతి పాత్రమైన రవి శంకర్ సితార్ వాదన రికార్డు-రాగం యమన్‌మంజ్ కాని అది సంధ్యారాగం; మధ్యాహ్నపు వేడి వాతావరణంలో సార విహీనంగా సోకింది. సంగీతంలో జీవమే లేకుండా పోయింది... బొంబాయిలో రోజులు ఇలాగే గడుస్తాయా? అన్న తలంపు రాగానే అశాంతితో మనస్సు కలవర పడి పోయింది.

సావిత్రి మూడింటికే వచ్చేసింది. అయినా ఫర్వాలేదు, ఏవరో ఒకరు దొరికారు తోడుకు అని సంతోషించింది కమల. రాత్రి భోజన సమయానికి ఇల్లంతా మళ్ళీ గోల గోలగా తయారైంది. వాళ్ళ మాటలు వింటూ తనను తానే మరచి పోయింది

కాని రాత్రి పడుకున్నాక మళ్ళీ దిగులు పట్టుకుంది. 'మంగవారంకూడా సోమవారంలాగే గడుస్తుందా? బుధవారం మంగళవారం లాగా, గురువారం బుధవారంలాగా..."

"ఓహ్? భగవాన్! భరించలేను. పారిపోవాలి" అనుకుంది కాని ఎక్కడికి?...

మరుసటిరోజు పొద్దున సావిత్రి నడిగింది? "అక్కా! నేనివాళ బయిటకెళ్ళాలనుకుంటున్నాను. పగటిపూట కూడా మఠం తెరిచి వుంటుందా? అక్కడ లైబ్రరీ, రీడింగ్ రూం వుండాలికదు?. ఏమైనా చదువుకుంటాను."

"తప్పకుండా వెళ్ళు....నీకసలు ఇలాంటి వాటిలో ఆసక్తి వుందని నాకు తెలీదు."

ఎలా వెళ్లాలో తెలుసుకుని, సరిగ్గా పదకొండింటికి మఠం చేరుకున్నది అక్కడంతా ప్రశాంతంగా వుంది. మనుషుల అలికిడేలేదు. రీడింగ్ రూంలో కెళ్ళింది. అక్కడ కొందరు మాత్రం గ్రంథపఠనంలో నిమగ్నులై వున్నారు. ఆ ప్రక్కనే ఒక గది ద్వారంపైన ఆఫీసు అన్న బల్ల చెక్క కనిపించింది. లోనికెళ్ళింది. ఆ రోజు హార్మోనియం వాయించిన బ్రహ్మచారి కూచుని ఏవో కాగితాలు చూసుకొంటున్నాడు.

"నేను స్వామీజీని దర్శించాలని వచ్చాను" అన్నది.

అతను తలెపైకెత్తి అన్నాడు. "ఆ మెట్లపైకి వెళ్ళండి. కుడి ప్రక్కన ఏడు నంబరుగదిలో వుంటారు స్వామీజీ. కానీ ఇప్పుడు తీరిగ్గా వున్నారోలేదో..."

సందేహిస్తూనే పైకి వెళ్ళింది. ఏడో నంబరు గది తలుపులు మూసివున్నాయి. భయం భయంగానే చిన్నగా తట్టింది. ఎంతోసేపటికి తలుపులు తెరుచుకున్నాయి స్వామీజీ బైటికొచ్చారు. తనని




మాశారు కాని గుర్తించినట్టుగా లేరు.

"నేను కమలని ఆ రోజు మా అక్కయ్య సావిత్రితో కలిసివచ్చాను.. మీరు మళ్ళీ రమ్మన్నారు"

స్వామీజీ మందహాసం చేశారు.

"అవునవును. రా, కూచో" అన్నారు

కూచుంది. స్వామీజీ! నేనేం చెప్పాలో నాకు తెలీదు. అసలు ఎందుకొచ్చానో కూడా తెలీదు. కాని ఇక్కడికొస్తే నా బాధలన్నీ తీరిపోతాయన్న ఆశ నన్ను లాక్కొచ్చింది."

"కారణాలు ముఖ్యంకావు. నిన్ను బాధిస్తోన్న సమస్య ఏమిటో చెప్పు" సూటిగా అడిగారు స్వామీజీ.

కమల కాస్త తటపటాయించింది. "స్వామీజీ! కొద్దిరోజుల క్రితం నా భర్త చనిపోయారు. నేనింకా ఎందుకు బ్రతకాలో, ఎలా బ్రతకాలో అర్థంకావటం లేదు.

"ఓ!" అంతా అర్థమైపోయినట్టు చిరునవ్వు నవ్వారు

"మీరు నాకు సహాయపడ్తారన్న ఆశతో వచ్చాను. మా అక్కయ్య సావిత్రి చెప్పింది. తనకు ఏ ఇబ్బంది వున్నా మఠానికొస్తే మనస్సుకు శాంతి చేకూడుతుందని. అందుకే ప్రతి ఆదివారం ఇక్కడికొస్తుంది. అదొక అలవాటుగా మారింది"

"నమ్మకంగా కూడా కావచ్చు" అన్నారు స్వామీజీ.

కావచ్చు నా భర్త బ్రతికుండగానే ఆయన్ని నమ్మాను. ఆ 'నమ్మకం' కాస్తా కోల్పోయాను. ఇప్పుడిక ఎందుకు జీవిస్తూవుండాలో తెలీటం లేదు."

"నీకు పిల్లలు వున్నారా?"

"ఉన్నారు. ఇద్దరు ఇద్దరూ ఏడేళ్ళ లోపు వారే. వాళ్ళతండ్రి చనిపోయాడని కూడా వాళ్ళకి తెలీదు."

"కానీసం వాళ్ళకొరకైనా బ్రతుకుండటం అవసరంకాదా?"

"అవును, నిజమే. కాని చాలాకష్టం"

"అసలు జీవితమే కష్టమయం. కాని

మరో మార్గంలేదు."

"ఆ జీవితానికి ఒక ప్రయోజన మంటూ లేకపోయినా కూడానా?''

"ప్రతి పనికీ ఏదో ఒక ప్రయోజనం వుండనే వుంటుంది, నువ్విప్పుడు గ్రహించుకోలేక పోవొచ్చు.... 'గీత' చదవరాదా?"

"ఒకసారి ప్రయత్నం చేశాను. నాకు విసుగెత్తింది. బహుశా నేను చదివిన అనువాదం మంచిది కాదేమో "

"అయితే, సంస్కృతంలో చదువు ఆ భాష నీకు రాకపోతే, ముందు అది నేర్చుకో. అదే ఒక ప్రయోజనం కావొచ్చుగా?''

కమలకు అది దారీ, గమ్యంలేని సంభాషణగా తోచింది. "థాంక్స్ స్వామీజీ! వస్తాను. శలవు" అంటూ లేచింది."

"మళ్ళిరా... నీ కెప్పుడు రావాలని పిస్తే అప్పుడురా"

"ధన్యురాలిని స్వామీజీ!" అంటూ అప్రయత్నంగా ఆయన కాళ్ళ మీద వాలింది. 'నన్ను దీవించండి' అని అందా మనుకుంది. కాని నోటినుండి మాట పెగ ల్లేదు.

ఆ సాయంత్రం అక్కతో అంతా చెప్పేసింది. సావిత్రి సంతోషించింది.

ఆ రాత్రి బాగానే నిద్రపట్టింది. రెండో రోజూ ఏడింటికి మెలకువొచ్చింది. అనుకోకుండానే, పదకొండు గంటలకల్లా ఏవో సంబరుగది దగ్గిరికి చేరుకుం . అలా కొద్దిరోజులపాటు ప్రతిరోజూ జరుగతూ వచ్చింది

స్వామీజీ నిర్వికారంగా, అరమరికలు లేని మృదు మధుర సంభాషణలతో, చిదానంద రూపంతో ఎప్పటికీ ఒకేలాగు కనిపించేవారు. కాని కమలలోనే, తనకు తెలియకుండానే ఏదో అర్థంకాని మార్పు వస్తోంది. తాను స్వామీజీ దగ్గరికి రోజూ ఎందుకు వస్తున్నట్టు? ఆత్మశాంతి కొరకా?... స్వామీజీ తననొక ప్రత్యేక వ్యక్తిగా ఏనాడూ పరిగణించ 'దు. ఏదో ఒక కారణంగా ఆయనదగ్గరికి అనేకులు వస్తారు. అందులో తనూ ఒక తె. ఆయన బోధించే బోధనల్లో ప్రత్యేక వ్యక్తిత్వానికి తావులేదు. వ్యక్తి ముఖ్యమే కాని అనుబంధాలు వ్యక్తిత్వానికి అతీతం. 'ప్రేమ' ను అందరూ పంచుకోవాలి. అందులో భేదాలు వుండకూడదు. ఇవన్నీ కమల వూహలకు భిన్నమైన భావాలు!

ఒకరోజు కమల వచ్చేసరికి స్వామీజీ లేరు. ఎక్కడికో బయటికెళ్ళారు. మనస్సు చివుక్కుమంది. తాను కేవలం ఆయనకోనమే అక్కడికొస్తున్నానన్న గ్రహింపుకలిగిం . బాధ కలిగింది. అంతకు క్రితం రోజు తనతో మాట మాత్రంగానైనా చెప్పలేదని చిరుకోపం కూడా వచ్చింది. తనంటే స్వామీజీకి లక్ష్యమేలేదన్న మాట! ... రెండో రోజు స్వామీజీని కలుసుకున్నప్పుడు ఆ మాటే అన్నది.

ఆయన నవ్వారు. "నేను లక్ష్యపెట్టటం లేదా? ఎందుకలా అనుకుటావు? నేను అందర్నీ లక్ష్యపెడతాను.''

"మీరు నిన్న కనిపించకపోతే నేనెంతో నిరాశ చెందాను"

వొద్దు, కేవలం నన్ను చూడటానికే నువ్వీ మఠానికి రావద్దు. ఇవాళడుంటాను




రేపు మరణిస్తాను. అంతమాత్రాన నువ్వు మఠానికి రావటం మానుకోవద్దు."

క్షణంపాటు వెనకాడింది కమల, చెప్పాలా వద్దా అని. చివరికి స్వామీజీ కళ్ళల్లోకి చూస్తూ, మెల్లిగా అన్నది. "క్షమించాలి స్వామీజీ! నిజం చెబుతున్నాను. నేనిక్కడికి రావటం కేవలం మీ కోసమే. నేను అసంభవమనుకున్నదాన్ని మీరు సంభవం చేసి చూపెట్టారు. నాలో మళ్ళీ జీవించాలనే వాంఛ అంకురించింది. ఇంత గొప్ప మార్పు కేవలం మీవల్లే జరిగిందంటే నమ్ముతారా?''

"కానీ తల్లీ!" అత్యంత నిర్వికార నిశ్చింతతో అన్నారు స్వామీజీ, "నలభై ఏళ్ళ క్రితమే నేను ఈ దేహానికి తిలోదకాలు ఇచ్చానని నీకు తెలీదేమో. ఇప్పుడిక ఇందులో ఏమీ మిగిలిలేదు. నేను ఇంకా జీవించి వున్నానంటే, నా జీవితాన్ని అంకితం చేసిన ఈ మత ప్రచారానికోసమే."

ఇద్దరూ ఒకరికళ్ళల్లోకి ఒకరు నిశితంగా చూసుకున్నారు. కాని నిజంగా అతను తననే చూస్తున్నాడన్న నమ్మకం కలగలేదు కమలకు. అతడ్ని తాకాలని పించింది, అమాంతంగా ఆయన పదద్వయంమీద తల ఆనించింది. అవి చల్లగా, నిర్జీవంగా, ఇందాక ఆయననోటి వెంట వెలువడ్డ మాటల్లా కర్కశంగా వున్నాయి. ....ఆ క్షణం దాటిపోయింది అంతా అయిపోయిందని తెలుసుకుంది. లేచి నిలుచుంది

"స్వామీజీ! నేనిక వెళ్తాను. తిరిగి రాను. నేనువున్నా జీవించటానికి సాధనం నాకు మీరు ప్రసాదించారు. బదులుగా నేనూ మీకెంతో ఇవ్వాలనుకున్నాను. కాని ఏమీ ఇవ్వలేకపోయాను.''

''కాదు. ఇచ్చావు" స్వామీజీ మందహాసం చిలికిస్తూ అన్నారు. "నీకు తెలీకుండానే, నన్ను నువ్వు అర్పించుకున్నావు. ప్రేమకంటే గొప్ప కానుక మరొకటి ఏముంటుంది? కాని నా ఈ కళేబరంలో దానికి చోటులేదు. అందుకే తిరిగి నీకు

ఇచ్చేస్తున్నాను. దాన్ని భద్రంగా జీవితాంతం నీతో దాచుకుంటావని నాకు తెలుసు."

మఠాన్ని విడిచి వెళ్ళిపోతూ వుండే, హృదయమంతా ఒక అనిర్వచనీయమైన సంతృప్తితో నిండిపోయింది. భర్త మధురమూర్తి కళ్ళెదుట నిలిచింది. విజయ్ తనకు భర్తగా లభించటం నిజంగా తన అదృష్టమే. కానీ ఇక లేడు; స్వామీ కూడా లేరు. తాను తన ఇంటికి తిరిగి వెళ్ళిపోతుంది. తన పిల్లల దగ్గరికి. ఏదైనా ఉద్యోగం చూసుకోవచ్చు. కాలేజీ రోజుల్లో వదిలేసిన వీణ కూడా తిరిగి చేపట్టొచ్చు. అవును, పునర్జీవనం ప్రారంభించాలి ఎక్కడో ఏదో చదివిన ఆంగ్లకవితా పదాలు జ్ఞాపకమొచ్చాయి :

"Only connect
the Rose and the Passion"

ఆ సాయంత్రం అక్కతో చెప్పింది. "అక్కా నేనిక వెళ్ళిపోతాను. వీలైతే రేపే వెళ్తాను."

సావిత్రి విస్తుపోయింది, "అప్పుడే వెళ్ళిపోతావా కమలా? ఇప్పుడిప్పుడే నీ వ్యక్తిత్వం స్థిరపడుతున్నావనుకుంటున్నాను"

కమలకు ఏం జవాబు చెప్పాలో తోచలేదు. సంక్షిప్తంగా అన్నది, "పిల్లలు జ్ఞాపకమొస్తున్నారక్కా! వాళ్ళని చూడాలి" 

సీరియల్

# సౌభాగ్యలత

ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవీ రామశాస్త్రి

(జరిగిన కథ)

(శ్రీమంత్ తిన్నగా రహస్య స్థావరానికే వచ్చాడు-మహేష్, అధికారులూ కలిసి దొంగతనంగా చేరవేసే సరుకు, లారీని విషయాన్ని గ్రహించాడు. బాధ్యత కొద్దీ తను [illegible] రహస్యంగా వెంటాడి తెలుసుకున్న విచిత్రమైన రహస్యం ఏదో కాదు- ఆ దొంగ సరుకు లారీ తన మామయ్య గారింటికే చేరింది. మహేష్‌కి తెలీకుండా మామయ్యా-లేక మామయ్యకు తెలీకుండా మహేష్!-తనకి తెలీకుండా ఇద్దరూనా? ఈ సందిగ్ధంలో సతమతమయ్యాడు శ్రీమంత్)

—ఇక చదవండి—

## 39

ఉదయం మేల్కొంచిన వకుళ ఆనందం వర్ణనాతీతం.

"ఇది కల కాదు! ఇది నిజం! శ్రీమంత్ నా భర్త! నేను అతడి అర్ధాంగిని! నా జీవితానికి అర్థం వున్నది, సఫలత వున్నది!"

ఇలాతలంపై పాదాలు నిలవటం లేదు ఏ పనిపైనా మనసు పోవడం లేదు ఒకటి స్వప్నలోకానే యింకా గడపాలని.... ...

"హుం. ఇందుకేనేమో క్రొత్త జంటలు ఈ నిత్య జంఝాటం నుండి దూరంగా పారిపోతారు!"

ఆ సుకుమార బాల హృదినీ, మనస్సునీ అంతగానూ గమనించగల స్థితిలో లేదు శ్రీమంత్

ఆమె లోకం వేరు, అతడి లోకం వేరు!

"వకుళా! ఈరోజు నేను ఆఫీసుకు వెళ్ళడంలేదు బయట కొంచెం పనివుంది."

అప్పటికే డ్రెస్ చేసుకొని బూట్ వేసుకుంటూన్న అతడిని విస్మయంగా చూచింది వకుళ

ఆ ప్రశ్న కనులలో గిర్రున తిరిగిన నీటిని చూడగల ఓపిక లేదు శ్రీమంత్‌కు.

"మనం ఈరోజే ఇల్లుమారాలి మధ్యాహ్నం వచ్చేసరికి నువ్వు సామానంతా సర్దివుంచు"

ఆమెకు మరి ప్రశ్నించే అవకాశమే లేదు. అతడు అప్పటికే గుమ్మందాటి కనుమరుగయ్యాడు

"నాకు తెలుసు వకుళా నీమనసు. నీ వదనంలోనికి సూటిగా చూస్తే -నీ కనుల లోని నీరు నన్ను ఒక్క అడుగు కూడా ముందుకు వేయనీయక నిలిపివేస్తుంది. నీతికి నిలబడిన వాడిని-నీరస పడరాదు. నా వద్ద నవవధువుగా నీకు తగిన సుఖం లభించడం లేదు కానీ ఏంచేయను? స్వామి కార్యం ముందు, స్వవిషయం తర్వాత!"

ఈ విధంగా అతడి సరళ హృదయపు తలపోతలు సాగుతున్నవని వకుళకు తెలియదు.

"ఒరేయ్ శ్రీమంత్, ఒరేయ్ నిన్నేరా ఏమిటా పరధ్యానం!"

అంటూ భుజంపై పడిన చేతిని పట్టుకుంటూ వెనక్కు తిరిగాడు శ్రీమంత్.

మరు క్షణంలో అతడి ముఖం ఆనంద ప్రఫుల్లమైంది.

"అరె నువ్వా సత్యం! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు కలుసుకున్నాం!"

ఆప్యాయంగా కరచాలనం చేశాడు.

"ఏమిటి-ఈ ఊళ్ళో ఉద్యోగమా?"

"ఆ. నువ్వు? ఇక్కడే వుండిపోయావా?"

"ఔను. ఇక్కడే చదువు ఇక్కడే ఉద్యోగం." అంటూ నవ్వాడు శ్రీమంత్.

"ఏమిటిలా కాలి నడకన తిరుగుతున్నావు?"

"లేకుంటే హెలికాప్టర్ ఎక్కడినుండి వస్తుంది?" అన్నాడు శ్రీమంత్ నవ్వేస్తూ.

"ఎందుకురాదూ నోరుండే? సరే పద మాయింటికి-అక్కడ మాట్లాడు కుందాం"

"సారీ! అడ్రస్ ఇవ్వు, మరోసారి కలుస్తా. ఇప్పుడు చాలా అర్జెంట్ పని వుంది."

కొంత కోపంగా, కొంత పరిశీలనగా చూశాడు సత్యం.

"ఔనులే, నీవు అర్జంటుగా ఓగర్ల్ ఫ్రెండ్‌ను కలుసుకోవాలి, అంతేగా? నడి రోడ్డు మీద పరధ్యానంగా నడిచే నీతీరే చెబుతోంది. కారణం" అన్నాడు నిష్ఠూరంగా.

"ఒరేయ్ అంత నిందవేయకు. నాకు వివాహమైంది."

"ఓ!" జ్ఞాపకం చేసుకుంటూ అన్నాడు సత్యం-

"ఔను. శశిరేఖ కదూ........మరచే పోయాను."




శ్రీమంత్ వదనం మలినమైంది.

"కాదు సత్యం అవన్నీ తర్వాత చెబుతాను" కానీ ప్రస్తుతం నన్ను వదులు. నాకు ఒక యిల్లు కావాలి ఈరోజే నేను అందులోకి మారాలి ప్లీజ్. ఇళ్ళ అన్వేషణలో బయలుదేరాను."

"కనుబొమ్మ ముడితో అన్నాడు సత్యం శ్రీమంత్‌ను విశదంగా చూస్తూ.

"నీ ముఖం మీద ఏదో పెద్ద సమస్య తారట్లాడుతోంది. పద నాతో. నేనూ నీకు సాయం చేస్తాను. ఒంటరిగా వదిలేది లేదు ఇంతకాలానికి కలుసుకున్నాక!" బలవంతంగా చేయి పట్టుకు నడవసాగాడు

"పెద్ద సియైడి లాగే మాట్లాడుతున్నావే!" ఆశ్చర్యంగా అన్నాడు శ్రీమంత్.

"పోనీ అలాగే అనుకో. అదుగో ఆ షాపు దగ్గరుంది నా కారు. పద."

కారు నెమ్మదిగా పోనిస్తూ అడిగాడు సత్యం

"ఏమిటంత త్వరగా యింటి మార్పు? గృహ యజమానితో గొడవ లేమైనా వచ్చాయా?"

"లేదనుకో. నిజానికి యిల్లు మా మామగారిదే. కానీ కొన్ని సమస్యలు చుట్టుకుంటున్నాయి అక్కడ."

"శ్రీమంత్! మనం చదువుకొనే రోజుల్లోనే అనుకొనే వాడిని-నీవంటి నిజాయితీ పరుడికి సమస్యలు చాలా వుంటాయని. లేకుంటే నీ వంటి తెలివైనవాడు ఇంకా యింత చిన్న ఉద్యోగంలో వుండి పోవడమేటి?"

"చిన్న ఉద్యోగమా? నీకెలా తెలుసు?"

"అదే అదే ......" తడబాటుతో అన్నాడు సత్యం

"ఏదేనీ చెయ్యి నీ వాలకం చూస్తే తెలియడం లేదూ!"

శ్రీమంత్ నవ్వేశాడు.

కారు ఆగింది

విశాలమైన ఆవరణలో ఠీవిగా నిలబడిన పెద్ద బంగళాను చూస్తూ అన్నాడు శ్రీమంత్

"ఎన్నాళ్ళో ఓపికగా ఉన్నావా? ఏం యింత రాజసంగా వస్తున్నది సంగతి?"

సత్యం సమాధానమియ్యక, నవ్వుతూ లోపలికి దారి తీశాడు

కాఫీ ఉపాహారాల సేవ చేస్తూ తీరికగా మాటలు మొదలు పెట్టాడు సత్యం.

"చెప్పు శ్రీమంత్, నా ఫ్రెండ్ ఒకరితో మాట్లాడతా నిప్పుడే నీకు ఇల్లు క్షణాలలో కుదుర్చుతాను బట్ వాటీజ్ ది ప్రాబ్లమ్? లెట్ మీ నో"

ప్రసన్నత హరించిన శ్రీమంత్ వదనం గంభీరంగా మారిపోయింది.

"మాట్లాడు శ్రీమంత్. ఒక స్నేహితునిగా నీకేమైనా సాయం చేయగలనేమో"

"బహుశః భగవంతుడు కూడా నాకు సాయం చేయలేడు సత్యం!......"

"ఊఁ...... కానీయ్, నీ మనస్సులో ఉన్నదంతా రానీయ్ బయటకు."

"రానిస్తే ఏమిటి? నీవు చేయగలిగినది?"

ఆ నిష్ఠురతకు ఆశ్చర్యంగా చూశాడు సత్యం.

"శ్రీమంత్!"

"ఔను సత్యం. మీ ధనవంతులందరూ ఒకటేననే భయం నన్ను నీ ముందు నోరు విప్పనీయడంలేదు నువ్వు నా చిన్ననాటి స్నేహితుడవే కావచ్చు. కానీ ఈనాడు ధనపు సెగలలో వున్నావు మరి నువ్వు!"

సత్యం మౌనంగా చూడసాగాడు.

"ఒక్కమాట చెప్పు సత్యం, మనిషి ఆనాటి కానాడు ఇంకా వృద్ధిలోనికి రావాలనీ యింకా సంపాదించాలనీ అనుకోవడంలో తప్పు లేదు. అది సవ్యంగా వుండాలి కానీ, మరొకడి నెత్తికొట్టి సంపాదించేదాన్ని ఎలా హర్షిస్తా? అవినీతిని ఎలా చూస్తూ ఊరుకోగలం!"

చిరునవ్వుతో వింటూన్న సత్యం ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

"నాకు తెలుసు సత్యం నువ్వు మాట్లాడలేవు. చిన్ననాటి ఆదర్శాలూ, స్నేహాలూ మరచిపోతారు మీ ధనవంతులు. అసలు నిన్ను నమ్మి నేనేమీ చెప్పలేను కూడా అసలు మా కంపెనీ డైరెక్టర్నే కలుసుకొని మాట్లాడాలని ఉన్నది నాకు. ఏమో - ఆ ధనికుని స్వభావం ఎట్లాంటిదో! కానీ ఇలాగే జరిగితే అతగాడి సర్వనాశనం తప్పదు!"

"నీలాంటి సత్యసంధులున్నంతవరకూ వారు బాగానే ఉంటారులే!" అన్నాడు

నిదానంగా సత్యం.

'ఔను. వారు బాగానే ఉండవచ్చు! కానీ పోయేది భయంతోనో భక్తితోనో దోపిడీకి సాయపడుతున్న చిన్న ఉద్యోగులూ, డ్రైవర్లూ వగైరా! ఇదంతా తెలిసీ కూడా ఏమీ చేయలేని ఒక చిన్న ఉద్యోగిని నేను! అందుకే పాముపడగ నీడవంటి ఆ ఇంటిని ముందు వదలివేయ దలచాను''.

"ఓహో! అయితే ఆ అవినీతివరులు నీ ఇంట్లోనే ఉంటున్నారని బలంగ మన్నమాట!"

''నన్నిక వెళ్ళనీ'' అంటూ లేచాడు శ్రీమంత్.

స్నేహంగా అతడిచేయి పట్టుకున్నాడు సత్యం

"శ్రీమంత్! ఏమిటా తుఫాను నీలో? నిన్ను నువ్వు ఎంతగా మరచిపోయావంటే-ఈ నా ఇల్లూ, హోదా చూస్తూనే నీవు నన్నుకూడా అసహ్యించుకోవడం ప్రారంభించావు. ఏమిటి-ఏం చేశారు ఈ ధనికులు నిన్ను?"

''నన్నొక్కడిని ఏంచేసినా బాధపడను. కానీ సంస్థలనే కొల్లగొడుతున్నారు దేశానికే నష్టం తెస్తున్నారు. చీడపురుగులయ్యారు."

"అదే నాకు చెప్పమంటున్నాను."

''చెబితే ఏం చేయగలవు?''

భావయుక్తంగా నవ్వుతూ తన కోటు లోపలి జేబులోనికి చేయి పోనిచ్చాడు సత్యం.

"నువ్వు రెండుసార్లడిగినా నేనేం చేస్తున్నానో నీకు చెప్పలేదు నేను. అయినా నీకునువ్వే నన్నొక వర్తకుడిగా ధనవంతుడిగా ఊహించేసుకొని మాట్లాడు

తున్నావంటే నీ మనస్సెంత తల్లక్రిందులైందో తెలుస్తోంది."

సత్యం జేబులోంచి తీసిన అయిడెంటిటీ కార్డు చూసి నిశ్చేష్టుడయ్యాడు శ్రీమంత్.

ఆప్యాయంగా అతని భుజం తట్టాడు సత్యం.

"ఇప్పుడు చెప్పు-నీ కభ్యంతరం లేదుగా యిక? నేను క్రైమ్ బ్రాంచిలో వర్క్ చేస్తున్నాను. కొన్ని పరిశోధనలకూ ఆధారాలకూ ఇక్కడికొచ్చాను. చాలా రహస్యం, అందుకే గవర్నమెంట్ బంగళాలలో కాక ఈ ప్రైవేట్ బిల్డింగ్‌లో వున్నాను."

ఆనందాతిశయంతో ఒక్కసారిగా సత్యాన్ని ఆలింగనం చేసుకున్నాడు శ్రీమంత్

"దైవికం అనే పదానికి నాకు అర్థం ఇప్పుడు బాగా తెలిసింది సత్యం, ఈ కఠిన కృత్రిమాలతో ఇక ఒంటరిగా పోరాడవలసిన అవసరం లేదు. నీ అండ నాకున్నది."

"ఆ మాత్రం భరోసా ఏర్పడిందిగా? వివరాలు విన్పించుమరి!"

"విను. నీ వనుకున్నట్టు శశితో వివాహం కాలేదు. ఆమె చెల్లెలు వకుళ నా భార్య. మా ప్రాజెక్టు ఆఫీసర్స్‌తో చేతులు కలిపి లక్షలు గడించుతూన్న ప్రైవేట్ కంట్రాక్టర్ మహేష్‌కు భార్య అయ్యింది శశి తోడల్లుడుగా తనకు సాయం చేయ గలననే ఆశ వుండేది మహేష్‌కు మొదట. కానీ అది జరగదని తెలిశాక కక్ష పెరిగింది. బోనస్ విషయంలో, ఇంక్రిమెంట్స్ విషయంలో - అడుగడుగునా పక్ష పాత వైఖరి చూపుతున్నారు. మహేష్ చేతిలో కీలుబొమ్మలైన మా ఆఫీసర్స్, అయినా నేను మాట్లాడలేదు. ఇవుకు అకగా గతరాత్రి ఆఫీస్ గొడౌన్స్ నుండీ, కంపెనీ యజమాని క్రొత్తగా కట్టుకుంటూన్న మేడ సామాను నుండీ దొంగిలించి తెచ్చిన సరుకంతా మాయింట-అదే-మా మామగారింట దాచారు!"

"ఐసీ! మీ మామగారెటువంటి మనిషి?"

నిట్టూర్చాడు శ్రీమంత్.

"నేను చెప్పలేను సత్యం. ఇంతకాలంగా మరి చాలా మంచివారనే అనుకుంటూ వచ్చాను. కానీ ఈ గతరాత్రి సంఘటనతో నాకు వ్యక్తులపై నమ్మకాలు తగ్గిపోయాయి."

"ఊఁ. అతడింట్లో కాక మామగారింట్లో దాచాడంటే........"

"ఏముంది? ఆరా రాక పోతే బ్రతికిపోతాడు. ఆరా వచ్చినా అతడికేం పర్వా లేదు. ఆ యింట కాపురముంటున్న నేను ఆ ఆఫీసు ఉద్యోగిని కదా! నేరం నాపైకి నెట్టగలరు!"

వింటూన్న సత్యం నిటారుగా అయ్యాడు.

"పద. కంపెనీ డైరెక్టర్ ఊళ్ళోనే వున్నాడు. అన్నీ చెప్దువుగాని."

ఆ. నాకు అన్నీ తెలుసు! నువ్వు కన్సర్న్ వివరాలన్నీ నా చెవిన తెలిసే
చేశావు. అయితే శ్రీమంత్! ధనవంతులందరినీ ఒకేవిధంగా అంచనా వేయకు అన్ని బ్రాంచీలనూ స్వయంగా తణిఖీ చేసుకోనే తీరిక యజమానికి లేక క్రిందివారి వల్ల కొన్ని అపక తవకలు జరుగవచ్చు 'అంతే'. మీడైరెక్టర్ చాలా మంచి వ్యక్తి. వద నువ్వే చూస్తావుగా? నేనూ వస్తాను!"

# 40

ఇంటికి వస్తూనే వకుళను ఎత్తి గిరగిరా త్రిప్పి వదిలాడు శ్రీమంత్.

"ఇక నీ భర్త కూడా తన తడాఖా చూపగల సమయం వచ్చింది వకుళా."

వకుళ కన్నార్పక చూడసాగింది అతడిలో పరవళ్లు త్రొక్కుతున్న ఉత్సాహ ఉత్తేజాలను-ఇటీవలి కాలంలో అతడిని యింత ఆనంద ప్రదంగా చూచి వుండలేదు.

ఆమె భావాలను చదవ గలిగాడు శ్రీమంత్.

"నీ నిరీక్షణకు ఫలితం దక్కింది, నా నిజాయితీకి కూడా ఈరోజు సత్కారం లభించింది! ఇదంతా నీ ప్రభావం! కేవలం నీ మహిమ వకుళా''

''ఏమిటి జరిగింది?"

"ఇంకా మెల్లగా అడుగుతున్నావా? ప్రమోషన్! మన ప్రతిభ గుర్తింపబడింది అదుగో అలా చూడు!"

వీధిలోనికి దృష్టి సారించింది వకుళ,

కారూ డ్రైవర్!

"అందులోనే ఇప్పుడు నేను వచ్చింది; ఫస్టుక్లాస్ ఇల్లు ఇచ్చారు వద-సామా నంతా సర్దేశావా? ట్రక్ వచ్చేస్తోంది.''

"ఆఁ''.

"ఏమిటి నీ మొఖంలో వుండేవలసినంత సంతోషంలేదు?"

"నిజంగా మహదానందంగా వుంది శ్రీమంత్. నిత్యం భారంగా వేదనతో నిండివుండే నీ ముఖం చూడలేక నాలో నేనే ఎంత కుమిలి పోయేదానో్న నిత్యం నిన్నిలాగే సంతృప్తితో నుంచెత్తమని ఆ దైవాన్ని వేడుకుంటున్నాను. కానీ....''

''ఏమిటి?"

ఈ ఇల్లు వదలడం అంటే బాధగావుంది.'

"పిచ్చిపిల్లా! ఆ బాధలూ వగలూ వాళ్ళకు సిమెెన ఉన్నాయా? అదుగో అలా చూడు మీ నాన్నగారి కాంపౌండ్‌లోని షెడ్స్ నిండా ఏమి వున్నాయో?"

''ఆఁ ఏవిటా బస్తాలన్ని?"

"మహేష్ దొంగసరుకంతా తెచ్చి ఇక్కడ దాస్తున్నాడు. అక్కడ తన మేడలో తనుంటాడు హాయిగా. ఇవన్నీ ఇక్కడున్న అతడి బంధువులకు పాము

పడగ నీడవంటిది. అందుకే మనం వెళ్ళిపోతున్నాం. వెనుకొకసారి నువ్వే అన్నావు
ఈ ఇంటినుండి దూరంగా వెళ్ళిపోవాలని."

"ఔను. కానీ మనం మనవారి చూసుకోండే మరి అమ్మా నాన్నగారు..."

"ఆ ఆలోచనా బాధా నాకూవున్నాయి. వద. ఎటూ వెళ్తున్నామని చెప్పి వెళ్ళ
పోనుకోవాలిగా? మన బాధ్యతగా విషయాలన్నీ చెప్దాం. మనసో నమ్మండాం. వారు
అవగాహన చేసుకొంటే సరే; లేకుంటే మనమేమీ చేయలేం."

"నీఆలోచన సబబుగానేవున్నది శ్రీమంత్ 'పద' నాన్నగారితో మాట్లాడుదాం."

భోజనం చేస్తూన్న రఘురామయ్య వదనం వికసించింది.

"రండి రండి కూర్చోండమ్మా"

కొద్ది దూరంలో నిలబడిన విశ్వేశ్వరి అడిగింది శ్రీమంత్‌ను.

"ఈరోజు ఆఫీసుకు వెళ్ళలేదా?"

"లేదండి. రెండు రోజులు సెలవు తీసుకున్నాను-కొంచెం పని వుండి.

"ఏం వకుళా? కూతురివి-ప్రక్కనే వున్నావు. అయినా ఎప్పుడో పది రోజుల
కోసారి వస్తావు చుట్టంలాగ." అని నిష్ఠుర మాడింది.

వకుళ నిర్మలంగా నవ్వింది.

"నువ్వు నన్ను రోజూ చూస్తూనే వున్నావు కదమ్మా మేడమీద నిలబడి, వేరే
రావడం దేనికి యిక?"

"ఔను. చూస్తూనే వున్నాను. పని మనిషికంటె కనాకష్టంగా పని
పడుతున్న పాట్లు!" అన్నది కఠినంగా.

"దాల్లో నీ ధోరణి ఎప్పుడూ ఒకటే".

రఘురామయ్య అదలించాడు.

"వాళ్ళకు కూడా వచ్చింది... భోజనాలు చేశారో లేదో. శ్రీమంత్ ఇంటినుండ
ఇక్కో రావడం చూశాను నేను." అన్నాడు మళ్ళీ.

"వద్దు". "వద్దండి"

వకుళా శ్రీమంత్ ఒకేసారి అన్నారు.

"అమ్మా!" వకుళ తల్లివైపు అందడుగులువేసి అన్నది.

"నీ ఎత్తిపొడుపులు వినడానికి నేను రాలేదు, [illegible]
పుట్టింటికి నేను రాని కారణం నీ ధోరణే. నేను చాలా హాయిగా సుఖంగా ఉన్నాను
ఉంటాను కూడా శ్రీమంత్ నడుమ వల్ల. ఆయనకు ప్రమోషన్ వచ్చింది. మేం
వేరే ఇంటికి వెళుతున్నాం. మీకు చెప్పి ఆశీర్వాదం పొందుదామని వచ్చాం. అంతే."

"కంగ్రాచ్యులేషన్స్"

మనస్ఫూర్తిగా అన్నాడు రఘురామయ్య.

"ప్రమోషన్ వచ్చినందువల్ల మీకు దూరంగా వెళ్ళిపోవాలా?"

"అదేం కాదత్తయ్యా, మాకు కంపెనీ ఇల్లు ఇచ్చింది, అందుకువెళ్తున్నాం"




అన్నాడు శ్రీమంత్.

"మరి అప్పుడప్పుడు వస్తుంటారుగా?" అన్నది పొడిపొడిగా.

ముఖ ముఖాలు చూచుకున్నారు వకుళా శ్రీమంత్‌లు, కొద్దిసేపు తనలో తాను మథనపడిన పిమ్మట వకుళ అన్నది!

"నాన్నగారూ మన షెడ్స్‌నిండా ఆ సరుకు ఏమిటి?"

"యేమోనమ్మా నాకు తెలియదు. రాత్రి వచ్చాయట, వాళ్ళింట్లో చోటు లేక ఇక్కడ దాచుకొన్నారట మీ అక్కా బావాను."

నిష్కపటి రఘురామయ్య.

లోలోన వింతైనా జాలి కలిగింది శ్రీమంత్‌కు

"వీరికి నిజం చెప్పడమా మానడమా?"

ఆలోచించుకొంటున్నాడు లోలోపల

ఇంతలో విశ్వేశ్వరి అతిశయంగా అన్నది.

"మహేష్ నాలుగంతస్తుల మేడ కట్టే ప్రయత్నంలో వున్నాడు. ప్లాన్‌లవీ అన్నీ సిద్ధంగా వున్నాయి. అందుకే ఆ సామాను మనిషంటే అతడు!"

అనుకోని ఈ విసురుకు అదరిపాటుతో శ్రీమంత్ కేసి చూచింది వకుళ.

అతడి వదనం ఎప్పటివలె గంభీరంగా, నిర్వికారంగా వున్నది.

కానీ తనభర్తపై నర్మగర్భత నిండిన ఆమాటలు వకుళకు ఆగ్రహాన్ని కలిగించాయి.

"మనిషంటే మానవత్వం వున్నవాడమ్మా. ధన రాసులున్నంత మాత్రాన

దొంగ మనిషి కాదు, వకుళకూడా కాదు!"

"వకుళా! ఏం వాగుతున్నావో తెలుసా?" అదలించింది విశ్వేశ్వరి.

రఘురామయ్య భోజనం ఆపి నిస్పృహాయతతో చూడసాగాడు.

"పెద్ద పెద్ద సంస్థల గొడౌన్స్ నుండి దొంగ తనంగా బావ తెచ్చుకుంటూన్న సరుకు అది. ఆ ఆఫీసర్లకు లంచాలు పెట్టి సంపాదించుతున్నాడు. కానీ బయట పడితే మాత్రం అతడి అంతస్తూ, నీ మురిపెమూకూడా నిలువవు!"

"అయ్యిందా గీతోపదేశం?"

వెనక నుండి విన వచ్చిన మాటలకు చివాలున తిరిగి చూచింది వకుళ. శ్రీమంత్ ఎటూ చూడక తలవాల్చుకున్నాడు.

"అక్కా! ఎప్పుడొచ్చావు?"

"నేను నిన్న రాత్రే వచ్చాను!"

అప్పటి నుంచీ కూడా నీకు నన్ను చూడాలన్పించలేదా అక్కా?"

"ఈ నాలుక చివర ప్రేమలకేం గానీ-నీకెవరు చెప్పారు నీ బావ దొంగతనం చేస్తూన్నట్టు?"

తీక్షణంగా అడిగింది శశి

"నేను!" శ్రీమంత్ కూడా అంతే తీవ్రతతో జవాబిచ్చాడు.

"ఛీ! మా విషయాలు మేం ఆలోచించుకోగలం. నువ్వు అసూయతో వేసే అభాండాలు ఇక్కడెవరూ నమ్మరు"

శ్రీమంత్ రఘురామయ్యతో అన్నాడు.

"మామయ్యా! నిజమే కొన్ని నా కనవసర విషయాలే కావచ్చు కానీ ఈ బాంధవ్యాలవల్ల అవసరమని నేననుకున్నాను మీకుచెప్పడం నా బాధ్యతగా భావించి చెప్తున్నాను" కొన్ని కంపెనీల- ప్రాజెక్టుల ఉద్యోగులతో లాలూచీ అయి మహేష్ ఈ సరుకు ఆ గిడ్డంగుల నుండి అక్రమంగా సంపాదించి తెచ్చాడు. అందుకే ఈ సరుకు అర్ధరాత్రి ఇక్కడకు చేరింది"

"ఆఁ"

ప్రప్రథమంగా విషయం వింటూన్న రఘురామయ్య అంతకంటె మాట్లాడ లేకపోయాడు.

"ఔను మామయ్యా. ఈ సరుకు మా ఆఫీసుగొడౌన్సులోనుండి. స్టోర్సునుండి నిన్న దొంగతనంగా లారీలలోనికెక్కించడం, తేవడం అన్నీ నేను చూశాను. ఇదంతా చాలా ప్రమాదం ఈ సరుకు మీ ఇంట్లో వుండడం మీకు ప్రమాదం,నేరం మీ మీదికే వస్తుంది"

"ఏమిటే ఇదంతా?"ఆగ్రహంగా విశ్వేశ్వరిని అడుగుతూన్న రఘురామయ్య ఇటు శ్రీమంత్ కూడా శశి ఆగ్రహ స్వరం విని నిశ్చేష్టులయ్యారు.

"గెటౌట్ శ్రీమంత్! నీకు అనవసర విషయాలలో తలదూర్చకు."

"శశీ!"

"బ్రతకడం రాని అసమర్థుడవయి బ్రతుకనేర్చిన వారిని చూచి ఈర్ష్య చెందుతున్నావు భార్యను కాలినడకన త్రిప్పేవాడివి, మామూలు పాతిక ముప్ఫై రూపాయల చీరకొని మురిసేవాడివి-నీకేం తెలుస్తాయి పెద్దపెద్ద విషయాలు?"

శ్రీమంత్ సాలోచనగా అన్నాడు.

"అయితే ఓ పేహ్ అక్రమ కార్యాలకు నీ మద్దతువున్నదన్న మాట! గోతిలో పడినవాళ్ళని చూస్తూ ఊరుకుంటాడు ఈర్ష్య వున్నవాడు; ప్రేమాభిమానాలున్న వాడే చనువు తీసుకొని హెచ్చరిస్తాడు."

"నీ హెచ్చరికలు మా కనవసరం కానీ నీ బ్రతుకు[illegible]కొంత మెరుగు పర్చుకో. సంతోషిస్తాం."

"ఇంత జరుగుతూన్నా మీరేం మాట్లాడరేం నాన్నగారూ?" వకుళ బాధగా అడిగింది.

అతడు నీళ్లు నముల్తున్నాడు.

శ్రీమంత్ స్థిరంగా అన్నాడు మామగారితో.

"మామయ్యా! చెప్పడం నా బాధ్యత గనుక చెపుతున్నాను. ఇవి ఇక్కడ ఉండటం మీకు చాలా ప్రమాదం. మీ ఇంట్లో వుండకూడదు.'

"ఇది మా ఇలు! నా యిల్లు!"

ఖంగుమన్నది శశిరేఖ గొంతు.

ఆమె చూపులలో హేళన నిండివున్నది.

మాటలలో అహం రం విజృంభించుకోంది.

నేలకు కాలు రాదిస్తూ, దర్వాజాను ఆనుకొని ఒయ్యారంగా నిలబడిన ఆ విగ్రహంలో ఆ పాద మస్తకం అతిశయ గర్వాలు తొణికిసలాడుతున్నాయి.

రఘురామయ్య ఏమీ మాట్లాడలేని అశక్తతో తలవాల్చుకున్నాడు

విశ్వేశ్వరి తీరులో ఏ మార్పూ కన్పట్టలేదు.

"పద శ్రీమంత్!"

వకుళ నెమ్మదిగా అన్నది.

"వెళ్తున్నాం"

ఒకరివెంటఒకరు నెమ్మదిగా కదలిపోతూన్న ఆ జంటను ఎవ్వరూ ఆపలేదు

వీధి గడపదగ్గర ఆగి వెనక్కు తిరిగాడు శ్రీమంత్.

"మా క్రొత్త యిల్లెక్కడో మీరు అడగకున్నా నేను చెబుతున్నాను. ఇదిగో ఆడ్రస్, నా పేద యింటికి అభ్యంతరం లేకుంటే మీ రెప్పుడయినా రావచ్చు."

కాగితం గడపపైవుంచి చకచకా నడచి పోయాడు.

వకుళ అనుసరించింది.

ఇంటిలోనికి వస్తూనే కన్నీటితో శయ్యపై వాలిపోతూన్న వకుళను పట్టి

అపాడు శ్రీమంత్

"ఏమిటీ పిచ్చి? త్వరగా సామాను సర్దాలి"

వకుళ కన్నీళ్ళు ఉధృతమైనాయి.

"వాళ్ళు నిన్నెన్ని మాటలన్నారు?" అన్నది వెక్కుతూ.

"నువ్వనలేదుగా? నాకేం లెఖ్ఖలేదు." అన్నాడు ఆమె అశ్రువుల నొత్తుతూ

"అక్కను అత్తింటికి ఎంత ఆప్యాయంగా........ఘనంగా పంపిందిఅమ్మ! నన్నెలా అవమానంతో సాగనంపింది ఈరోజు!"

"అమాయకురాలా! ఇదిగో ఇదే నీ పుట్టిల్లు! ఇదే నీ అత్తయిల్లు. అన్నీ ఇక్కడే నీకు, కాదనగలవా?" ఆ బాహువల్లరిలో బందీ అయిన వకుళ తన వ్యధ నంతా మరచింది.

అవును. మంచి భర్త గుండెను మించిన గుడీ, మమతానురాగాలను మించిన గౌరవ సత్కారాలూ ఏముంటాయి? ఎక్కడుంటాయి.

"ఊఁ. నవ్వుతూ బయల్దేరు క్రొత్త యింటికి, అక్కడ ఎప్పుడూ యిలాగే వుండవచ్చు కానీ, ప్రస్తుతానికి నన్ను వదిలిపెట్టు" కొంటెగా అన్నాడు.

"ఎప్పుడూ అంటే? మరి ఉద్యోగం?"

"అఫ్ కోర్స్! అది వుంటుందనుకో!"

"కానీ శ్రీమంత్! ఒక్క ప్రార్థన, ఇతరుల గురించి అమితంగా ఆలోచిస్తూ మన అమూల్యమైన కాలాన్ని జీవితాన్నీ వ్యర్థం చేయకు."

"ఊఁ రాత్రి చాలా ఆలస్యంగా వచ్చాననేగా నీ ఫిర్యాదు?"

"అదుగో. అలా హాస్యాలతో ఎరగగొట్టవద్దు. నిజంగానే చెబుతున్నాను"

"ఆల్ రైట్! అదుగో సామాన్లకోసం లారీవచ్చేసింది పద. క్రొత్త ఇంటికి వెళ్ళాలి. ఒక స్నేహితుడి ఇంటికి భోజనానికివెళ్ళాలి మనం చాలా పనులున్నాయి"

కాపురం దులు...ంతగా రఘురామయ్య మాత్రం దగ్గరకు వచ్చాడు.

"జాగ్రత్తమ్మా, వస్తాండె ఎప్పుడైనా" అన్నాడు.

"తప్పకుండా రండి నాన్నా." (సశేషం)

Edited & Published by V. Leelavathy Raghavaiah. at 3-5-1039/1 Narayanaguda, Hyderabad-20 & Printed by P. Ramakrishna at Raghava Printers, 1-8-4/1/1, Chikkadpalli, Hyderabad-500 000.